Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు | స్థాపితం: 1930 | జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

జమీన్ రైతు

సంపుటి: 82 • సంచిక: 24 • 17-6-2011 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# సత్తిబాబులో అంత సత్తా దాగివుందా?

సత్తిబాబు సంచలనాల బాబుగా మారిపోయాడు. పుట్టలో నుంచి పాము బయటకు వచ్చినంత నిశ్శబ్దంగా ఆయనలోని సత్తా ఒక్కసారిగా వెలికి రావడంతో అందరూ నోరు వెళ్లబెడుతున్నారు. ఔరా అని ఆశ్చర్యపోతున్నారు. కాంగ్రెస్‌వాదులే కాదు ప్రత్యర్థులు కూడా విస్మయం వ్యక్తం చేస్తున్నారు. పిసిసి అధ్యక్ష పదవి చేపట్టిన వారం రోజులలో బొత్సా సత్తిబాబు రాష్ట్ర రాజకీయాలలో సృష్టించిన కదలిక, కలవరం, కల్లోలం అంతా ఇంతా కాదు. గాంధీభవన్‌కు వున్నట్లుండి పెళ్లి కళ వచ్చింది. పిసిసి పదవికి ఎక్కడలేని గ్లామర్ అంటుకొన్నది. నిన్నటి వరకు సత్తిబాబు నలభై మంది మంత్రులలో ఒకడు. కానీ ఈరోజు పది మంది మంత్రులు ఆయన చుట్టూ ఎప్పుడూ మూగి వుంటున్నారు. కాంగ్రెస్ కార్యకర్తలలో ఉత్సాహం పెల్లుబుకుతున్నది. కడప ఉప ఎన్నికల తర్వాత భవిష్యత్తు లేదనే నిరాశతో, చచ్చుబడి వుండిన కాంగ్రెస్ పార్టీ ఒక్కసారిగా జవసత్వాలు సంతరించుకొన్నది.

మరణశయ్య మీద వున్న కాంగ్రెస్ పార్టీకి సత్తిబాబు మృతసంజీవని మూలిక అందిస్తాడని ఎవరూ భ్రమపడరు. కానీ ఏదో ఆశ, అది దింపుడు కళ్లెం ఆశే కావచ్చు, కాంగ్రెస్‌వాదులలో పుట్టుకొని రావడానికి సత్తిబాబు కారకుడైనాడన్నది నిజం. పిసిసి పగ్గాలు చేపట్టిన తర్వాత ఒక్క క్షణం వృధా చేయలేదు. బొంగరం తిరిగినట్లు గిర్రున తిరుగుతున్నాడు. అందరినీ ఆప్యాయంగా పలకరిస్తున్నాడు. మంత్రులతో ముచ్చట్లాడుతున్నాడు. ఎమ్మెల్యేలు చెప్పింది ఓపికగా వింటున్నాడు. నిర్మొగమాటంగా మాట్లాడుతున్నాడు.

## కిరణ్‌కు ఒళ్లు మంట

ఈ పోకడ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డికి ఒళ్లు మంటెత్తిస్తున్నది. బొత్సాను పిసిసి కుర్చీపై కూర్చోబెట్టిన వార్త టీవీలో వచ్చేంత వరకు ఆయనకు కూడా తెలియదు. అధిష్టానం ఆయన సలహా పడలేదు. సిఫార్సు తీసుకోలేదు. తనకు పోటీగా, తనకు ప్రమాదకరంగా పిసిసి అధ్యక్షత ఒక అధికార కేంద్రం వలె మారిపోతున్నదన్న గుబులు ముఖ్యమంత్రిలో స్పష్టంగా కన్పిస్తున్నది. మంత్రులు, ఎమ్మెల్యేలు బొత్సా ఇంట్లో గుమికూడడం పుండు మీద కారం చల్లినట్లుంది. జగన్ ఆకర్షణ నుంచి జనాన్ని వెనక్కు తిరిగి రాబట్టడం ఎట్లా అనే అంశం మీద బొత్సా తన ఇంట్లో ఒక చిన్న సమావేశం నిర్వహించాడు. దానికి ఎనిమిది మంది మంత్రులు హాజరైనారు. డిప్యూటీ సిఎం దామోదర రాజనర్సింహ, ఆనం రామనారాయణ రెడ్డి, రఘువీరారెడ్డి, ధర్మాన ప్రసాదరావు వంటి సీనియర్లున్నారు అందులో. చూసేవారికి అది మినీ క్యాబినెట్ సమావేశం వలె వుండింది. తన వద్దకు వచ్చే ఎమ్మెల్యేలకు సంబంధించిన పనుల కోసం బొత్సా నేరుగా ఐఎఎస్ అధికారులకు ఫోన్లు చేస్తున్నాడు. కలెక్టర్లతో కూడా మాట్లాడుతున్నాడు. ప్రభుత్వ నియంత్రణ పిసిసి చేతికి పోతుందేమోననే భయం కిరణ్‌కుమార్‌రెడ్డిలో కల్గుతున్నది దాని వల్ల.

## తప్పు బొత్సాది కాదు

రాజకీయమనే బండికి ముఖ్యమంత్రి, పిసిసి అధ్యక్షత అనేవి జోడెద్దుల వంటివి. రెండూ ఒద్దికగా నడిస్తేనే ప్రయాణం సాగుతుంది. ఎడమొఖం పెడమొఖం అయితే రసాబాస అవుతుంది. ఇప్పుడు రాష్ట్రంలో

కొరవ 14వ పేజీలో

# అతి చేస్తున్న అన్నా

లోక్‌పాల్ బిల్లు రూపకల్పనలో ప్రతిష్టంభన తొలగడం లేదు. అటు అన్నా హజారే ప్రతినిధులు, ఇటు కేంద్ర ప్రభుత్వ మంత్రులు తమ తమ వాదనలపై మంకుపట్టు పట్టడంతో ఇప్పటికి ఏడుసార్లు సమావేశాలు జరిగినా ఏకాభిప్రాయం కుదరడం లేదు. ఇప్పట్లో కుదిరే సూచన కూడా లేదు.

లోక్‌పాల్ బిల్లు అవసరం దేశానికి ఎంతైనా వుందన్న నిజం ఎవరూ కాదనలేరు. రాజకీయ అవినీతి చెదపురుగుల దాడి నుంచి ప్రజలను రక్షించాలంటే ఇటువంటి చట్టపరమైన రక్షణ తప్పనిసరి. ఆ బాధ్యత తన భుజాన వేసుకొని అన్నా హజారే ప్రజలకు ఎంతో దగ్గరైనాడు. ఎక్కడో మహారాష్ట్రలోని ఒక మారుమూల గ్రామంలో అనామకంగా బ్రతికే ఆ సమాజ సేవకుడు రాత్రికి రాత్రి జాతి ఆకాంక్షలకు సంకేతంగా మారిపోయాడు. పెచ్చరిల్లిన రాజకీయవాదుల దుర్నీతి అందుకు ఒక కారణం. అధికారాన్ని తమ అక్రమార్జనకు లైసెన్స్ బిళ్లగా భావించి, లక్షల కోట్ల రూపాయలు నిర్లజ్జగా దోచుకొంటున్న తీరు ప్రజలకు తీవ్ర ఆగ్రహం కల్గించింది. ఈ దుర్మార్గాలకు అడ్డుకట్ట వేసే వాడి కోసం జాతి మొత్తం ఆతృతగా ఎదురు చూస్తున్న సమయంలో అన్నా హజారే ముందుకు వచ్చాడు. దేశ ప్రజల అభిమానాన్ని కొల్లగొట్టాడు.

అంత మాత్రాన తాను చెప్పిందే శిలాశాసనంగా అమలు చేయాలని అన్నా హజారే పట్టుబట్టడం మాత్రం అభ్యంతరకరం. అన్నా హజారే విద్యాధికుడు కాదు. పరిపాలనా అనుభవం లేదు. ప్రభుత్వ నిర్వహణలో ఎదురయ్యే సవాళ్లు ఆయనకు తెలియవు. జన జీవనం సాఫీగా సాగడంలో రాజ్యాంగం పాత్ర మీద అవగాహన లేదు. వ్యక్తిగా మంచివాడు కావడం ఒక్కటే ఆయన అర్హత. పరిపాలనా పరమైన నిర్ణయాలలో ఆ ఒక్క అర్హత సరిపోదు. ఆ మాటకొస్తే కేంద్రంలో కానీ, రాష్ట్రంలో కానీ అధికారంలో వున్న వారంతా అవినీతిపరులు కాదు. ఎకె ఆంటోని, మమతా బెనర్జీ వంటి ఆదర్శప్రాయ రాజకీయవాదులు ఇంకా మన వ్యవస్థలో మిగిలే వున్నారు.

మనది ప్రజాస్వామ్య దేశం. మెజార్టీ ప్రజల మనోభిప్రాయం ప్రకారం ప్రభుత్వం నడవాలన్నది రాజ్యాంగ నిర్మాతల ఆకాంక్ష. అందుకోసం వారు పటిష్టమైన రాజ్యాంగాన్ని నిర్మించి ఇచ్చి వెళ్లారు. గత అరవై ఏళ్లుగా ప్రపంచంలో ఎన్ని రకాల రాజకీయ మార్పులు వచ్చాయో తెలిసిన సంగతే. పొరుగునే వున్న పాకిస్తాన్ ఎన్ని పాట్లు పడుతున్నదీ చూస్తూనే వున్నాము. అయితే ఎన్ని విధాల ఆటుపోట్లు ఎదురైనా భారతదేశం మాత్రం సమగ్రంగా, సుభిక్షంగా వుండగలగడానికి కారణం మన పెద్దలు ఇచ్చి వెళ్లిన రాజ్యాంగమే రక్షణ. దాని రూపకల్పనలో పాలు పంచుకొన్న రాజ్యాంగ మండలి సభ్యుల పేర్లు ఒక్కసారి జ్ఞప్తికి తెచ్చుకొంటే ఒళ్లు పులకరిస్తుంది. దేశం కోసం సర్వస్వం అర్పించే త్యాగ గుణం, స్వార్థమన్నది మచ్చుకు కూడా లేని నిర్మలత్వం, రాజనీతిజ్ఞతను ఔపోసన పట్టిన నైపుణ్యం, అపారమైన మేధస్సు, భవిష్యత్తు దర్శనా పఠిమ వంటి అరుదైన గుణాలు కల్గిన నెహ్రూ, పటేల్, రాజాజీ, రంగా, మౌలానా, అంబేద్కర్, గోవిందవల్లభ పంత్ వంటి మహిమాన్వితులు రెండు సంవత్సరాల పాటు క్షీరసాగర మదనం వలె శ్రమించి, తమ మేధస్సునంతా మేళవించి తయారుచేసిన పవిత్ర పుస్తకం మన రాజ్యాంగం.

జమీన్‌రైతు

ఇప్పుడు అన్నా హజారే అడుగుతున్న కొన్ని కోరికలు, ఆ రాజ్యాంగాన్ని అతిక్రమించే తీరులో వున్నాయి. పార్లమెంటుకు కూడా జవాబుదారీ కాని రీతిలో లోక్‌పాల్ వ్యవస్థ వుండాలని కోరుతున్నారు వారు. అది ఎంత మాత్రం సమ్మతం కాని విషయం. ఎంత గొప్పవాళ్లైనప్పటికీ, నలుగురైదుగురు పౌర సమాజ ప్రతినిధులు దేశ భవితవ్యాన్ని నిర్దేశించే రీతిలో ప్రవర్తించడం ప్రోత్సహించదగిన పద్ధతి కాదు. ఏ చట్టం చేసినా, పాలనా వ్యవస్థలో ఏ మార్పు తలపెట్టినా, అది ఎన్నికైన ప్రజాప్రతినిధులతో కూడిన పార్లమెంట్‌కు పూచీకత్తుగా వుండాలే తప్ప, మించి మెలగాలని కోరుకోవడం దేశానికి హితం కాదు. ప్రజల నుంచి తమకు లభించిన అసాధారణ మద్దతును అన్నా హజారే బృందం దుర్వినియోగం చేస్తున్నదా అన్పిస్తున్నది వారు అడుగుతున్న గొంతెమ్మ కోరికలు చూస్తే. తమను చూసి కేంద్ర ప్రభుత్వం భయపడడాన్ని వారు అలుసుగా తీసుకొంటున్నారు. అన్నా హజారే తన ప్రవర్తనలోని అతిని గుర్తించి, తన పరిమితులకు లోబడి అవినీతి నిర్మూలన ఉద్యమాన్ని ముందుకు తీసుక వెళ్లగలిగితేనే, జనాభిమానం నిలుపుకోగలుగుతాడు.

## జనవాణి

### మన సినిమాకు అవమానం

ఇటీవల కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన జాతీయ సినిమా అవార్డులలో తెలుగు సినిమాకు ఒక్క అవార్డు కూడా రాకపోవడం బాధ కల్గించింది. మన పొరుగు రాష్ట్రాల వారితో పోల్చుకుంటే మన సినిమా బాగా వెనుకబడినట్లు నిరూపణ అయ్యింది. తెలుగు పరిశ్రమ సంక్షోభంలో కూరుకుపోవడానికి కారణం సినిమా పట్ల అవగాహన లేనివారు పరిశ్రమకు వచ్చి సినిమాలు తీయడం. వీరు విదేశాల్లో షూటింగ్, భారీ సెట్టింగులపై కనపరుస్తున్న ఆసక్తిలో పదో వంతు కూడా సినిమా స్క్రిప్ట్‌పై పెట్టడం లేదు. నాసిరకం సినిమాకు ఎన్ని రంగులద్దితే జనం చూస్తారు? జాతీయ స్థాయిలో అవార్డులొస్తాయి??

పి.అరుణకుమారి — నెల్లూరు

### సమస్యలు పరిష్కరించండి!

నెల్లూరు బిఎస్ఎన్ఎల్ జనరల్ మేనేజర్‌గా గోపి పదవీ బాధ్యతలు స్వీకరించింది మొదలు శ్రమించి ఆ సంస్థను దేశంలోనే మొదటి స్థానంలో నిలిపారు. పది కోట్ల రూపాయల ఆదాయాన్ని ఆర్జించినందుకు అభినందనలు. కాని బిఎస్ఎన్ఎల్ ల్యాండ్‌లైన్లలో శబ్దాలు వస్తున్నాయి. సెల్‌ఫోన్లు మధ్యలో కట్ అవుతున్నాయి. ఈ రెండు సమస్యలు కూడా పరిష్కరిస్తే బాగుంటుంది.

రామసుబ్రహ్మణ్యం — నెల్లూరు

### బధిర ప్రభుత్వం

రాష్ట్రంలో రేబిస్ వ్యాధిగ్రస్తులు రోజురోజుకి పెరిగి పోతున్నారు. కానీ ప్రభుత్వానికి చీమ కుట్టినట్లు లేదు. గ్రామాల్లోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో రేబిస్ వ్యాక్సిన్ అందుబాటులో లేదు. పోలియో వ్యాక్సిన్ మాదిరి రేబిస్ వ్యాక్సిన్‌ను రాష్ట్రంలోని అన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు, నర్సింగ్ హోమ్‌లలో అందుబాటులో వుంచను ఇప్పటికైనా రాష్ట్ర ప్రభుత్వం ప్రయత్నించ మనవి.

పి.రమణయ్య — దామరమడుగు

### ఆ రైలును నెల్లూరుకు పంపండి!

భారత ప్రభుత్వం స్వామి వివేకానందుని జీవిత చరిత్రకు సంబంధించిన చిత్రాలతో ప్రత్యేక రైలును ఏర్పాటు చేసింది. స్కూల్ పిల్లలతోపాటు పెద్దలు ఒకసారి ఈ రైలులోనికి వెళ్లి వస్తే చాలు వివేకానందుడు పూర్తిగా అర్థమై పోతాడు. దేశంలోని అన్ని ప్రముఖ పట్టణాలకు వస్తున్న ఈ రైలు నెల్లూరుకు రావడం లేదని తెలిసింది. ఇది చాలా బాధాకరమైన విషయం. దక్షిణ మధ్య రైల్వే జనరల్ మేనేజర్ చొరవ తీసుకొని ఈ రైలును నెల్లూరు రైల్వే స్టేషన్‌కు పంపే ఏర్పాటు చేయమనవి.

వొమ్మిన సుబ్రహ్మణ్యం — నెల్లూరు

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

20-6-1941
పేజీలు : 10 వెల: అణా

### రంధ్రాన్వేషి
### హిందూ పత్రిక

రష్యా మహా కవి డ్రాప్లిస్‌కి పెద్ద విప్లవ సామాజికుడు. ఇంక 20 మందితో గూడా మరణ శిక్ష వేసి వధ్య శిలమోల నగ్నాంగులుగా అందరినీ నిలబెట్టినారు. ఒకరు వెంబడి ఒకరిని నరకుచూ మన కవి ప్రక్కవాని శిరం కూడా తన కండ్లెదుటే ఎగిరి పోయింది. ఇంతలో ఒక రౌతు కొన ఊపిరితో వచ్చి గుర్రం దిగి ఇంక చంపక వదిలివేయమని ఆజ్ఞాపత్రం దండనాధికారికిచ్చాడు. ఇది విని మిగిలిన ఖైదీలలో ఇద్దరు అట్టనే మరణించారు. డ్రాప్లిస్‌కి పిచ్చిబట్టి దేశాలు తిరిగి భగ్న హృదయంతో మరణించాడు చివరకు.

### కళ్యాణరావు కుమార్తె నిర్యాణము

కటికనేని కళ్యాణరావు గారి ప్రథమ తనయ ప్రసవగండంతో మరణించిందన్న విషాద వార్త ఇప్పుడే విన్నాం.

కాంగ్రెసు, జమీన్‌రైతు ఉద్యమాలలో దెబ్బతిన్న కుటుంబాలలో యిదొకటి. 1921 ప్రాంతంలో కటికనేని వారనే వారే లేకపోతే కాంగ్రెసు ఉద్యమమనే మందార మొలక వెంకటగిరి టౌన్ అనే స్మశాన వాటికలో మొలవనే మొలవదు. 1931 జమీన్‌రైతు ఉద్యమమనే బాలికకు వెంకటగిరి క్షేత్రంలో నిలువనీడ దొరికే వుండదు. కావున కటికనేని వారి ఆనాటి త్యాగానికి వెంకటగిరి పౌరులు, రైతులు సదా కృతజ్ఞులై యుండక తప్పదు. కటికనేని సోదరులలో కళ్యాణరావు గారు చాలా మంచి వారు. సుస్వభావి. కపట మెరుగని వ్యక్తి. వీరికి కలిగిన ఈ విపత్తుకు మా సంతాపం తెలుపుతున్నాము.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

16-6-1961
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### ఖాసా సుబ్బారావు అస్తమయం

ప్రముఖ పత్రికా రచయిత, స్వరాజ్య పత్రిక సంపాదకుడు ఖాసా సుబ్బారావు 16వ తేది తెల్లవారు ఝూమున మద్రాసులో దివంగతులైనారని తెల్పుటకు విచారిస్తున్నాము. నిశిత, నిర్భయ విమర్శకులు సుబ్బారావు కొంత కాలం 'స్వతంత్ర' వార పత్రికను తెలుగు, ఇంగ్లీషులలో నిర్వహించారు. సుబ్బారావు గారి మరణం స్వేచ్ఛా పత్రికాలోకానికి తీరనిలోటు. సుబ్బారావు కుటుంబానికి 'జమీన్‌రైతు' సానుభూతి. వారి ఆత్మకు భగవంతుడు శాంతిని ప్రసాదించుగాక.

### తెలుగువారు కనుగొన్న ట్రాన్సిస్టర్ రేడియో

హైదరాబాదులోని ఇరువురు రేడియో టెక్నీషియన్లు క్రొత్త రకం ట్రాన్సిస్టర్ రేడియోను కనుగొన్నారు. ధరలో, బరువులో, పనిచేయడంలో, అందంలో అన్నివిధాల ప్రస్తుతం అమలులో వున్న ట్రాన్సిస్టర్ల కంటే విశిష్టంగా వుండగలదట ఈ క్రొత్త ట్రాన్సిస్టర్. దీని ఖరీదు రూ.150. దీనిని ఆంధ్ర లఘు పరిశ్రమల మంత్రికి చూపి, తర్వాత మార్కెట్‌లో ప్రవేశ పెడతారట.

ట్రాన్సిస్టర్ రేడియో అంటే చంకకు తగిలించుకొని ఎచ్చటకంటే అచ్చటకు తీసుకపోవుటకు అవకాశముండే అతి చిన్న రేడియో అనేది మా పల్లెటూరి పాఠకులకు కూడా తెలిసే వుంటుంది.

### విఆర్ కాలేజి పేద విద్యార్థుల నిధి

పేద విద్యార్థుల సహాయార్థం వదాన్య శేఖరులు తిక్కవరపు రామరెడ్డి గారు పదివేల రూపాయల నిధిని ఏర్పాటు చేస్తున్నారు.

విజ్ఞాన ప్రదీపికలో చమురుపోసిన ఈ దాతను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము.

# నెల్లూరు ముచ్చట్లు

## కొత్త రిజర్వేషన్ పద్ధతితో జడ్పీ జనరల్ అయ్యింది

నెల్లూరు జిల్లా ప్రజా పరిషత్‌ను మరొకసారి జనరల్ స్థానంగా ప్రకటించింది రాష్ట్ర ప్రభుత్వం. గత ఎన్నికలలో కూడా ఈ స్థానం జనరల్‌గా వుండబట్టి కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఛైర్మన్ అయ్యాడు. రిజర్వేషన్ల నియమం ప్రకారం ఒకసారి ఒక రిజర్వేషన్‌కు కేటాయించిన స్థానంలో తిరిగి అదే రిజర్వేషన్ ఇవ్వకూడదు. కానీ నెల్లూరు విషయంలో రెండుసార్లు జనరల్ కావడం జనంలో ప్రశ్నలు రేకెత్తిస్తున్నది. ఈ నిర్ణయానికి కారణం – మహిళా రిజర్వేషన్లలో అనుసరించిన కొత్త పద్ధతి. గతంలో మహిళలకు 33 శాతం రిజర్వేషన్ వుండేది. దాన్ని ఇప్పుడు 50శాతానికి పెంచారు. కోటాలో మార్పు వల్ల పాత లెక్కలు పక్కనపెట్టి, కొత్త పద్ధతికి ఇదే మొదలుగా లెక్కలు కట్టారు. దానితో నెల్లూరు జనరల్ అయ్యింది. అదే 33 శాతం రిజర్వేషన్ పద్ధతి అయి వుంటే, నెల్లూరు జనరల్ అయ్యే అవకాశం లేదు.

ఇప్పుడు మొత్తం రిజర్వేషన్ల ప్రక్రియను హైకోర్టు స్టే చేసింది కాబట్టి, వారిచ్చే తీర్పును బట్టి, ఈ కేటాయింపులు నిలుస్తాయో, లేక మళ్లీ రెడ్డొచ్చే మొదలెడు అన్నట్లు మారుతాయో తెలియదు.

## ప్రత్యేకాధికారిగా అనంతరాము

ప్రకృతి వైపరీత్యాల సమయంలో ప్రజలకు జాగ్రత్తలు చెప్పే అధికారులను రాష్ట్ర ప్రభుత్వం జిల్లాకొకరి చొప్పున నియమించింది. నెల్లూరు జిల్లాకు గతంలో ఇక్కడ కలెక్టర్‌గా పనిచేసి వెళ్లిన అనంతరామును నియమించింది. జూన్ నుంచి సెప్టెంబర్ వరకు ఈయనను ఈ బాధ్యతలు చూడాలని ఆదేశించింది. కానీ మన జిల్లాలో ప్రత్యేకాధికారికి నవంబరు మాసంలో పని వుండవచ్చు.

## సిఎంపై ప్రతిపక్షం మండిపాటు

నెల్లూరులో ఇబ్బడిముబ్బడిగా అనుమతులు మంజూరు చేసిన థర్మల్ విద్యుత్ కేంద్రాలపై మాట్లాడను అఖిల పక్ష కమిటీ నెల క్రితం ముఖ్యమంత్రి అపాయింట్‌మెంట్ కోరితే ఇంతవరకు ఇవ్వకపోవడంపై సిపిఎం జిల్లా కార్యదర్శి జక్కా వెంకయ్య, తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, సిపిఐ జిల్లా కార్యదర్శి పముజుల దశరథరామయ్య ధుమధుమలాడారు. ముఖ్యమంత్రి పని సంతృప్తికరంగా లేకపోయినా అర్జీదారులను కలవను సైతం ఆసక్తి చూపకపోతే ఎలా?

## ఆర్టీసికి రికార్డు స్థాయి కలెక్షన్!

నెల్లూరు ఆర్టీసి రీజియన్ ఏర్పాటు చేసింది మొదలు ఎప్పుడూ రాని విధంగా 11వ తేది రూ.95.73 లక్షలు కలెక్షన్ వచ్చింది. ఆ రోజు అన్ని డిపోల పరిధిలోని బస్సులన్నీ 95 శాతం ప్రయాణీకులతో తిరగ్గా, రాపూరు డిపోలో బస్సులు మాత్రం 101 శాతం ప్రయాణీకులతో తిరిగినట్లు రీజియన్ మేనేజర్ కొమరయ్య చెప్పారు.

## నెల్లూరు ఆర్డీఓ బదలీ

నెల్లూరు ఆర్డీఓ వేణుగోపాల్‌రెడ్డిని రాజమండ్రికి బదలీ చేశారు. ఆయన స్థానంలో నంద్యాలలో ఆర్డీఓగా పని చేస్తున్న మాధవీ లతారెడ్డిని నియమించారు. వేణుగోపాల్ రెడ్డి గ్రూప్ వన్ టాపర్. నెల్లూరులో ఆయన విధి నిర్వహణను చక్కగా నిర్వర్తించాడు. ప్రజలు ఏ సమస్యతో వెళ్లినా తన పరిధిలో పరిష్కారానికి దారులు వెతికేవాడు.

కొత్త ఆర్డీఓ మాధవీలతారెడ్డి కూడా నెల్లూరుకు పాతకాపే. ఆమె ఇక్కడి రైస్ రీసెర్చ్ స్టేషన్‌లో శాస్త్రవేత్తగా పనిచేశారు. ఆమె తండ్రి కూడా ఇక్కడి యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా శాఖ మేనేజర్‌గా పనిచేశారు.

## విజిలెన్స్ నాయుడికి ప్రమోషన్

నెల్లూరు విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ విభాగంలో సిఐగా పని చేస్తుండిన శ్రీనివాసులు నాయుడికి డిఎస్పీగా ప్రమోషన్ వచ్చింది. విజిలెన్స్ ఎస్పీ మోహన్‌రావుకు శ్రీనివాసులు నాయుడు మంచి సహకారం అందించడం వల్ల రాష్ట్రంలోనే నెల్లూరు విజిలెన్స్ శాఖ అక్రమార్కులపై దాడులుచేసి కోట్లాది రూపాయలను ప్రభుత్వ ఖజానాలో జమ చేయించింది.

## గొలగమూడిలో అభివృద్ధి పనులు

గొలగమూడి వెంకయ్యస్వామి సన్నిధిలో పలు అభివృద్ధి పనులకు పాలకవర్గం పచ్చజెండా ఊపింది. దేవస్థానం వద్దనున్న కోనేరు అభివృద్ధికి కోటి రూపాయలు, కళ్యాణ మండపం నిర్మాణానికి 72 లక్షలు, ఆశ్రమ పాఠశాలల్లోని బాలబాలికలకు వేర్వేరు వసతి గృహాల నిర్మాణానికి అనుమతి మంజూరు చేశారు. 32 లక్షలతో బైపాసు రోడ్డు, 40 లక్షలతో సిమెంటు రోడ్లు, అదనపు మరుగుదొడ్లు, ఉచిత మూత్రశాలల నిర్మాణానికి గ్రీన్‌సిగ్నల్ ఇచ్చారు. ఈ పనుల కోసం 3.50 కోట్లు మంజూరు చేస్తూ నిర్ణయం తీసుకొన్నారు. సమావేశానికి కమిటీ ఛైర్మన్ రాంబాబు అధ్యక్షత వహించగా, కమిటీ సభ్యుడైన జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి కూడా హాజరయ్యారు.

### చందాదారులకు మనవి

- చందా పంపించేటప్పుడు తమ చందా నెంబరు, పూర్తి పేరు, చిరునామా తెలియపరచండి.
- మీ చందా నెంబరు, చందా ఏ తేదికి అయిపోతుందో, అడ్రసు రేపరు మీదనే ముద్రించి వుంటుంది.
- 'జమీన్‌రైతు' చందాదార్లు తమ చందాను ఎం.ఓ/డి.డి లేదా On-lineలో ఆంధ్రాబ్యాంక్, విఆర్‌కాలేజి బ్రాంచి, నెల్లూరు అకౌంట్ నెంబర్: 106811011000423లో ZAMINRYOT పేరుతో జమచేయవచ్చు. సకాలంలో చందా చెల్లించవలసినదిగా కోరుతున్నాము.
- చెక్కులు స్వీకరించబడవు.

**జీవిత చందా రూ.1000/-**

**సంవత్సర చందా**

స్వదేశంలో రూ.200/-
విదేశాలకు రూ.1000/-

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190

## పెద్దాసుపత్రిలో నీటి కొరత

నెల్లూరు పెద్దాసుపత్రిలో నీటి కొరత ఏర్పడడంతో రోగులు అల్లాడిపోయారు. నీళ్లులేవని డాక్టర్లు ఆపరేషన్లు నిలిపి వేశారు. ఉన్నతాధికారుల దృష్టికి ఈ సమస్య వెళ్లడంతో మూడవ రోజు సమస్యను పరిష్కరించారు.

## ఎస్పీ రాకుండా అడ్డుకొంటున్నారు

ఎస్పీగా నియమితుడైన బి.వి. రమణకుమార్ నెల్లూరుకు రాకుండా ఆనం బ్రదర్స్ అడ్డుకొంటున్నారని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ నేత ఆనం వెంకటరమణారెడ్డి విమర్శించారు. తిరుమలలో జరిగిన డాలర్ల కుంభకోణాన్ని బయట పెట్టిన రమణకుమార్ వంటి అధికారి ఇక్కడకు వస్తే వారి ఆటలు సాగవనే ఉద్దేశ్యంతో అడ్డుకొంటున్నట్లు వెంకటరమణారెడ్డి స్పష్టం చేశారు.

## దేవాదాయ శాఖ కమిషనర్ బదలీ

నెల్లూరు దేవాదాయ శాఖ సహాయ కమిషనర్ బి.మహేశ్వరరెడ్డిని గుంటూరుకు బదలీ చేశారు. కదిరిలో పనిచేస్తుండిన యానాదిశెట్టిని ఇక్కడ నియమించారు. ఇటీవల సహాయ కమిషనర్ పనితీరు నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డికి నచ్చక బహిరంగంగా విమర్శించిన నేపథ్యంలో సహాయ కమిషనర్ బదలీ చర్చనీయాంశమయ్యింది.

## కాకాణి కుటుంబీకుల సాయం!

అల్లూరు మండలం నార్తుమోపూరు గ్రామ అభివృద్ధికి స్వంత ఆస్తులు ఇచ్చిన వదాన్యుడు కాకాణి వేణుగోపాల్‌రెడ్డి స్మారకార్థం ఆయన మనుమడు చెన్నైలో స్థిరపడ్డ అభినయ్‌రెడ్డి 20 లక్షల రూపాయల ఆర్థిక సహాయాన్ని నెల్లూరులోని ప్రగతి ఛారిటీస్‌కు ప్రకటించారు. ఈ మొత్తాన్ని ఈ వారంలో వేణుగోపాల్‌రెడ్డి సోదరుడు కాకాణి పాండురంగారెడ్డి ప్రగతి ఛారిటీస్ ఛైర్మన్ జె.వి.రెడ్డికి అందించారు.

## కృష్ణచైతన్య విద్యార్థుల ప్రతిభ

నెల్లూరులోని విక్రమ సింహపురి విశ్వవిద్యాలయం విడుదల చేసిన డిగ్రీ మొదటి సంవత్సరం ఫలితాల్లో కృష్ణ చైతన్య డిగ్రీ కళాశాల విద్యార్థులు మార్కుల మోత మోగించారు. పరీక్షకు హాజరైన వారిలో 94 శాతం మంది డిస్టింక్షన్‌లో పాసయ్యారు. ఇది రాష్ట్రంలోనే అరుదైన రికార్డు. 59 మందికి 90 శాతం పైగా మార్కులు వచ్చాయి. కాలేజి నుంచి పరీక్షకు హాజరైన 64 మందిలో 60 మందికి డిస్టింక్షన్ వచ్చిందని కళాశాల డైరక్టర్లు చంద్రశేఖర్‌రెడ్డి, కృష్ణారెడ్డిలు తెలిపారు.

## విడుదల కానీ జిఓ

గ్రామ పంచాయితీల పరిధిలో కేంద్ర ప్రభుత్వ నిధులతో పలు పథకాలు అమలవుతున్నాయి. వీటి పర్యవేక్షణకు ప్రతి గ్రామ పంచాయితీకి ఇద్దరు ఉద్యోగులను నియమించాలని కేంద్ర ప్రభుత్వం సంకల్పించింది. వాస్తవానికి 2011 – 12 ఆర్థిక సంవత్సరం నుంచి ఉద్యోగుల నియామకం చేపట్టాల్సి వున్నా ఆర్థిక సంవత్సరం మొదలయ్యి మూడు నెలలైనా ఇంతవరకు ఆ ప్రక్రియ చేపట్టలేదు. పంచాయితీల్లో జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం, రక్షిత తాగునీటి పథకం, ప్రధాన మంత్రి సడక్ యోజన తదితర కేంద్ర పథకాలన్నింటినీ రాష్ట్ర ప్రభుత్వ అధికారులే పర్యవేక్షిస్తుండడం వల్ల పనుల్లో పురోగతి లేదు.

## కిడ్నీ ఆపరేషన్‌కు సాయపడండి!

నెల్లూరు నగరంలోని పానగల్ రాజా రోడ్డు వాసి సయ్యద్ సాదిక్(18)కి గత ఏడాదిగా రెండు కిడ్నీలు చెడిపోయాయి. చిన్న వయస్సులోనే కుమారుడికి ఈ దుస్థితి రావడంతో చూడలేని ఆయన తండ్రి మియాజాన్ కూడా చనిపోయాడు. డయాలసిస్‌తో బతుకీడుస్తున్న సాదిక్ సోదరులు దినకూలీలు. నారాయణ హాస్పిటల్‌లో డాక్టర్లు సాదిక్‌కు కిడ్నీ మారిస్తే ఫలితం వుంటుందన్నారు. సాదిక్ సోదరుల్లో ఒకరు కిడ్నీ ఇవ్వను ముందుకొస్తున్నాడు. ఆపరేషన్‌కు అవసరమైన మొత్తాన్ని దాతలిచ్చి సహాయ పడమంటున్నారు. వదాన్యులైన దాతలు 9440934711, 9885879992 నెంబర్లకు ఫోన్‌చేసి సాదిక్ అకౌంట్‌లో డబ్బువేసి అతని ఆపరేషన్‌కు సహకరించవచ్చు.

## సినిమాకు వస్తూ సమస్యలు చెప్పండి

రూరల్ ప్రజలకు శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి క్రొత్త సూచన చేశాడు. నియోజకవర్గ ప్రజలు తమ సమస్యలు తెలుపుకొనేందుకు పనిగట్టుకొని తన వద్దకు రానవసరం లేదని, నెల్లూరుకు సినిమా చూసేందుకు వచ్చినపుడు ఎసి సెంటర్‌కు వచ్చి కలిస్తే చాలని చెప్పాడు. ఎమ్మెల్యే సూచన పలువురిని ఆశ్చర్యపరిచింది. సినిమా హాలుకు వచ్చినపుడు ఎమ్మెల్యేని కలవమని చెప్పడం గతంలో ఎవ్వరూ చేయని సూచన.

## రాత్రికి రాత్రి బోర్డులు మారాయి

గుర్తింపులేని విద్యాసంస్థలపై చర్యలు తీసుకోవాలని ప్రైవేట్ పాఠశాలల అసోసియేషన్ల నుంచి వచ్చిన ఒత్తిడి మేరకు విద్యాశాఖ అధికారులు నగరంలో పాఠశాలల తనిఖీకి వెళ్లిన సంద

కొరవ 14వ పేజీలో


విలేకరుల సమావేశంలో మాట్లాడుతున్న ఆదాల. ప్రక్కన మంజుభార్గవి.

# ఆదాల నృత్య కళాపీఠం

• నిర్వహణ బాధ్యతలు నటి మంజుభార్గవికి.

కళలను, కళాకారులను ప్రోత్సహించేందుకు సర్వేపల్లి శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి నూతనంగా ఆదాల నృత్య కళాపీఠాన్ని స్థాపించారు. ఈ పీఠం ఏర్పాటు, తదితర అంశాలపై ప్రఖ్యాత నృత్య కళాకారిణి, సినీనటి మంజుభార్గవితో కలసి విలేకర్లకు వివరించారు. కళాకారులు బాగుంటేనే సమాజం బాగుంటుందని వారిని గౌరవిస్తే దేశానికి గౌరవం అన్నారు. అలాంటి కళాకారులను ప్రోత్సహించే కళలకు పూర్వవైభవం తీసుకు రావాలన్న ఉద్దేశ్యంతో నృత్య కళాపీఠాన్ని స్థాపించామన్నారు. అన్ని నృత్యాలలోనూ కూచిపూడికి ప్రత్యేక స్థానం వుందన్నారు. ప్రస్తుతం కనుమరుగైపోతున్న ఈ నృత్యాన్ని తిరిగి ప్రోత్సహించేందుకు కూచిపూడి నృత్య పోటీలు నిర్వహించదలచామన్నారు. ఇకపై ప్రతి ఏటా ఈ పోటీలు మూడు రోజులపాటు జరుగుతాయన్నారు. మొదటిసారి ఈ ఏడాది ఆగష్టు నెల 4వ తేది నుంచి 7వ తేది వరకు జాతీయస్థాయి కూచిపూడి నృత్య పోటీలు నిర్వహించి ప్రతిభ కన్పరచిన వారికి నగదు బహుమతి అందజేస్తామని ప్రకటించారు. నృత్య కళాకారులను సన్మానించి లక్ష రూపాయలు ఇస్తామన్నారు. కస్తూరిదేవి ప్రాంగణంలో జరుగబోయే ఈ పోటీల్లో 10–15, 15–20, 20–25 సంవత్సరాల మధ్య వున్న వారిని గ్రూపులుగా విభజించి నిర్వహిస్తామన్నారు. మంజుభార్గవి మాట్లాడుతూ తెలుగు వారి సంపదైన కూచిపూడి నృత్యాన్ని, కళాకారులకు ప్రోత్సాహం అందించేందుకు ఆదాల చేస్తున్న కృషిని ప్రశంసించారు. నృత్యపీఠం ఏర్పాటు సంతోషకరమన్నారు. మహిళలతోపాటు మగవారికి నాట్యరీతుల్లో తగిన ప్రోత్సాహం ఇస్తామన్నారు.

● ఆ కరస్పాండెంట్లు

# చెప్పినట్లే చేస్తారు!

జిల్లాలో ప్రభుత్వ అనుమతిలేని, గుర్తింపులేని పాఠశాలలపై చర్యలు చేపట్టే విషయంలో విద్యాశాఖ వ్యవహరిస్తున్న తీరు వివాదాస్పదం అవుతోంది. ప్రభుత్వ నిబంధనలకు అనుగుణంగా భవనం, క్రీడా మైదానం తదితర అంశాలతో పాఠశాల నిర్వహించడంతోపాటు గుర్తింపు తప్పనిసరి. అలా గుర్తింపులేని పాఠశాలల్లో చదవడం వల్ల విద్యార్థులు నష్టపోతారు. చాలాకాలంగా పెద్ద పెద్ద కార్పొరేట్ స్కూళ్లతోపాటు పలు పాఠశాలలకు గుర్తింపు లేకపోయినా పాఠశాలలు నిర్వహిస్తూనే వున్నాయి. కొన్ని కార్పొరేట్ స్కూళ్లు ఒకటి రెండు పాఠశాలలకు మాత్రమే గుర్తింపు తీసుకొని మిగతా వాటిని ఎలాంటి గుర్తింపు లేకుండానే కొనసాగిస్తున్నాయి. వీటిపై చర్య తీసుకోమని చాలాకాలంగా విద్యార్థి సంఘాలు విద్యాశాఖ అధికారులను డిమాండ్ చేస్తున్నాయి. ప్రకటనలు ఇవ్వడం తప్ప చర్యలు చేపట్టిన దాఖలాలు లేవు. ఈ ఏడాది ఈ వివాదం కొత్త రంగు పులుముకొంది. కార్పొరేట్, ప్రైవేట్ స్కూళ్ల అసోసియేషన్‌లు ఈ వివాదాన్ని తమకు అనుకూలంగా మలచుకొనేందుకు డిఇఓను పావుగా వాడుకోవడం చర్చనీయాంశమయ్యింది. స్కూలు కరస్పాండెంట్ అయిన అధికార పార్టీ మాజీ కార్పొరేటర్, స్కూలును నిర్వహించే మాజీ విద్యాశాఖ అధికారి, రైలు కట్ట ఆవల వున్న ఒక కరస్పాండెంట్ తదితరులు కలిసి డిఇఓ పేరుతో విద్యార్థుల తల్లిదండ్రులకు సూచనలు చేస్తూ ఒక పేపర్ ప్రకటన ఇచ్చి దానికయ్యే మొత్తాన్ని వారే చెల్లించారు. అలాగే కరపత్రాలను సైతం డిఇఓ బాలకాశయ్య పేరున వీరే ప్రింట్ చేయించి నగరంలో ఇంటింటికి పంచేలా ఏర్పాటు చేశారు. మరో అసోసియేషన్ ఏకంగా ధర్నాకు దిగింది. తమ స్వార్థం కోసం, పాఠశాలల మధ్య వుండే స్పర్ధలను అవకాశంగా చేసుకొని లబ్ధిపొందేందుకు ప్రైవేట్ స్కూళ్లు నడుపుతున్న వ్యవహారంలో విద్యాశాఖ అధికారులు దూరంగా వుండాల్సింది పోయి వారు చెప్పినట్టల్లా డూడూ బసవన్నలా తల ఆడించడం విద్యాశాఖ పరువు పెన్నపాలయ్యేలా చేస్తోంది. జిల్లాలో గతంలో ఎన్నడూలేని విధంగా ప్రైవేట్ స్కూళ్ల యాజమాన్యాల మధ్య ఏర్పడిన పోటీ కారణంగా ఒకరిపై ఒకరు బురద చల్లుకొనే వరకు వెళ్లింది. ఈ వ్యవహారంలో విద్యాశాఖ ఉన్నతాధికారులు తల దూర్చడంతో విద్యాశాఖకు తలవంపులు తెచ్చి పెడుతోంది.




# బ్లాక్‌పోయి నకిలీ టిక్కెట్లు వచ్చే..

■ నెల్లూరు సినిమా హాళ్ల వద్ద సరికొత్త మోసం!



సినిమా టిక్కెట్లకూ నకిలీల బెడద వెంటాడుతోంది. నిన్నమొన్నటి వరకు బ్లాక్‌మార్కెట్‌లో అధిక ధరలకు విక్రయిస్తున్న టిక్కెట్లు కొనుగోలుచేసి సినిమా చూస్తున్న ప్రేక్షకులను నకిలీ టిక్కెట్లు దారుణంగా దెబ్బతీస్తున్నాయి. ఇటీవల విడుదలైన బద్రీనాథ్ సినిమాతో ఈ నకిలీ టిక్కెట్లు వెలుగులోకి వచ్చాయి. ప్రేక్షకులు, అభిమానుల ఉత్సాహాన్ని తమకు అనుకూలంగా మలచుకొని పంపిణీదారులు, సినిమా హాళ్ల యాజమాన్యాలు, కొందరు అభిమాన సంఘాల వారు సమిష్టిగా బ్లాక్‌లో టిక్కెట్లను దాదాపు 1200 రూపాయలకు విక్రయించి సొమ్ము చేసుకోవడం ఇటీవల కాలంలో విచ్చలవిడిగా జరుగుతోంది. బహిరంగంగా ఈ తతంగం సాగుతున్నా ప్రకటనలు గుప్పించే అధికారులకు ఇవేమీ కన్పడవు. చివరకు బ్లాక్ టిక్కెట్ల నుంచి నకిలీ టిక్కెట్లు అమ్మే స్థాయికి చేరుకొంది వ్యవహారం. బద్రీనాథ్ సినిమా మొదటి రోజు టిక్కెట్లుకొని హాలులోకి వెళ్లిన ప్రేక్షకులకు దిమ్మతిరిగినంత పనైంది. ఒకే సీటు నెంబరు ఇద్దరిద్దరికి కేటాయించి వుండడంతో పలువురు వాగ్వివాదానికి దిగారు. తీరా అసలు విషయం తెలుసుకొని నెత్తినోరు బాదుకోవాల్సి వచ్చింది. వాటిని కొన్న ప్రేక్షకులు యాజమాన్యం వద్దకు వెళితే ఆ టిక్కెట్లతో మాకేమీ సంబంధంలేదని చేతులెత్తేసారు. హాలు బయట బహిరంగంగా టిక్కెట్లు బ్లాక్‌లో విక్రయిస్తున్నా పట్టించుకోని యాజమాన్యాలు నకిలీ టిక్కెట్ల వ్యవహారంపై గమ్మునుండడం పలు అనుమానాలకు తావిస్తోంది. ఈ వ్యవహారమై జాయింట్ కలెక్టర్ స్పందించాల్సిన అవసరం ఎంతైనా వుంది.

# శంకరాభరణంతో ఎనలేని కీర్తి!

దాదాసాహెబ్ ఫాల్కే అవార్డును మించిన కీర్తిని శంకరాభరణం సినిమా తీసుకవచ్చిందని ప్రముఖ సినీనటి, కూచిపూడి నృత్య కళాకారిణి మంజుభార్గవి వ్యాఖ్యానించారు. నగరానికి వచ్చిన ఆమె నాట్యం, సినిమాలకు సంబంధించిన వివిధ విషయాలను ముచ్చటించారు. చిన్ననాటి నుంచి నాట్యం అంటే ప్రాణం. నా ఇష్టాన్ని గ్రహించిన మా అమ్మానాన్న కుటుంబ స్నేహితుడు, ప్రఖ్యాత కళాకారుడైన వెంపటి చిన్న సత్యం వద్ద నృత్యం నేర్పించారు. ఎంత ఇష్టంగా కష్టపడి డ్యాన్సు నేర్చుకొన్నానంటే ఇప్పటికీ ప్రతిరోజు డ్యాన్సు చేయందే దినచర్య ప్రారంభం కాదు. ప్రస్తుతం కూచిపూడి నృత్యానికి మంచి ఆదరణ వుందని ఈ కళపై పలువురికి మక్కువవున్నా శిక్షణ ఇచ్చేవారు లేక దూర ప్రాంతాలకు వెళ్లలేక నృత్యంపై అనాసక్తి చూపుతున్నారన్నారు. నృత్య కళాకారిణిగా పేరు తెచ్చుకోవాలన్న ఆశతో వున్న నాకు సినిమాలపై ఏనాడూ ఆసక్తి లేదు. కళాతపస్వి కె.విశ్వనాథ్ గారు నా నాట్యాన్ని చూసి శంకరాభరణం సినిమాలో నన్ను తీసుకొన్నారు. ఆ సినిమా ఎనలేని పేరు ప్రతిష్టలు తెచ్చి పెట్టింది. పద్మశ్రీలు, డాక్టరేట్లు ఆ సినిమాకు వచ్చిన పేరు ముందు దిగదుడుపే. తర్వాత ఎన్నో సినిమాలు చేసినా అంతటి పేరు రాలేదు. చిరస్థాయిగా నిలచిపోయే పాత్ర ఇచ్చిన విశ్వనాథ్‌ను మరచిపోలేను. ఇక బెంగుళూరులో 27 ఏళ్లుగా నాట్యవేదం పేరుతో నృత్య కళాశాలను నడుపుతూ ఎంతో మందికి శిక్షణ ఇస్తున్నట్లు చెప్పారు.

## మనసులో మాట చెప్పిన మంజుభార్గవి



### నెల్లూరులోనూ

# రేబిస్ మరణం!

**నెల్లూరు నగరంతోపాటు జిల్లాలోని ప్రతి పల్లెలోనూ కుక్కలు స్వైర విహారం చేస్తున్నాయి. అధికారులు వీటిని పట్టించను ప్రయత్నించడం లేదు. కుక్కకాటుకు గురైన వారికి వ్యాక్సిన్ అందుబాటులో లేదు.**

జిల్లాలో రేబిస్ మరణం నమోదయ్యింది. చిల్లకూరు అరుంధతీయవాడకు చెందిన వెంకటమ్మ మే 4వ తేది కుక్క కాటుకు గురయ్యి వ్యాక్సిన్ వేయమని ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి వెళ్లింది. అక్కడ వ్యాక్సిన్ లేదనడంతో గూడూరు రెడ్‌క్రాస్ సంస్థ వద్దకు వెళ్లి డబ్బు చెల్లించి రెండు డోసుల సూది మందును వేయించుకొన్నా ఫలితం లేకుండా పోయింది. ఏది ఏమైనా జిల్లాలో కుక్క కాటుకు సకాలంలో వైద్యం అందడం లేదు. దీంతో ప్రజలు తీవ్ర భయాందోళన చెందుతున్నారు. ఇటీవల రాష్ట్రవ్యాప్తంగా కుక్కకాటుకు పలువురు మృత్యువాత పడ్డ సంగతి తెలిసిందే. ఈ సంఘటనతో రాష్ట్ర ప్రభుత్వం స్పందించి అన్ని ప్రభుత్వ వైద్యశాలల్లో కుక్క కాటుకు వేసే వ్యాక్సిన్‌ను అందుబాటులో వుంచాలని వైద్య ఆరోగ్య శాఖను ఆదేశించింది. అయితే మన జిల్లాలో మండల కేంద్రాలు, గ్రామీణ ప్రాంతాల్లో వున్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో కుక్క కాటుకు వేసే వ్యాక్సిన్ అందుబాటులో లేదని చెబుతున్నారు. గ్రామీణ ప్రాంతాలతోపాటు పట్టణ ప్రాంతాల్లో విచ్చలవిడిగా కుక్కలు వున్నాయి. ప్రతి రోజూ ఏదో ఒక గ్రామంలో పిల్లలు, పెద్దలు వీటి కాటుకు గురౌతున్నారు.

## అందుబాటులోలేని వైద్యులు

కుక్క కాటుకు గురికాబడిన వారు వ్యాక్సిన్ వేయించుకునేందుకు ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి వెళ్తే వైద్యులు అందుబాటులో వుండడం లేదు. సిబ్బందిని సంప్రదిస్తే డాక్టర్ చెప్పందే వ్యాక్సిన్ వేయడం కుదరదనో లేకుంటే అందుబాటులో లేదు మరుసటి రోజు రమ్మని సలహా ఇచ్చి పంపుతున్నారు. మధ్యాహ్నం 12 గంటల తర్వాత పిహెచ్‌సిలలో సిబ్బంది పత్తా లేకుండా పోతున్నారు. రేబిస్ వ్యాధి సోకిన కుక్క కరిస్తే చాలా ప్రమాదకరం. ఈ రోగికి వెంటనే వ్యాక్సిన్ వేయకపోతే ప్రాణాలు కోల్పోతాడని వైద్యులు చెబుతున్నారు. బయట మార్కెట్లోగానీ, రెడ్‌క్రాస్ ఆసుపత్రిలో గానీ ఇందుకు సంబంధించిన వ్యాక్సిన్ దొరుకుతుంది.

## బయట కొనాల్సిందే!

ప్రభుత్వ వైద్యశాలల్లో ఉచితంగా వ్యాక్సిన్ వేస్తారు. బయట వంద నుంచి రెండు వందల రూపాయలు ఒక వ్యాక్సిన్ వేయించు కొనేందుకు చెల్లించాల్సి వుంటుంది. గ్రామీణ ప్రాంతాల నుంచి పట్టణానికి వచ్చి అధిక ధరలు చెల్లించి వ్యాక్సిన్ వేయించుకోవడం పేద ప్రజలకు భారంగా మారింది. జిల్లా అధికారులు ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో వ్యాక్సిన్ అందుబాటులో వుంటుందని ప్రకటిస్తున్నారే తప్ప ఈ వ్యాక్సిన్ అందుబాటులో లేదనే వైద్యులు, వున్నా సకాలంలో రోగికి వేయని సిబ్బందిపై మాత్రం చర్యలు తీసుకోవడం లేదు. కుక్క కాటు కారణంగా ఎక్కడ రేబిస్ వ్యాధి సోకుతుందోనని జిల్లా ప్రజలు వణికి పోతున్నారు.

వీధుల్లో విచ్చలవిడిగా తిరుగుతూ ప్రజల్ని భయకంపితుల్ని చేస్తున్న కుక్కలను పట్టుకోవాల్సిన బాధ్యత గ్రామ పంచాయితీ, మునిసిపాల్టీలదే. అయితే ఈ రెండు శాఖల అధికారులు వీధుల్లో స్వైర విహారం చేస్తున్న కుక్కల గురించి పట్టించుకోవడం లేదు. ప్రజలు ఆగ్రహం వ్యక్తం చేస్తేనే మునిసిపాల్టీలు, గ్రామ పంచాయితీ అధికారులు స్పందిస్తుంటారు. మిగిలిన సమయంలో కుక్కల గురించి అసలు పట్టించుకోరు.

## రేబిస్ మహమ్మారి!

రేబిస్ కుక్క ద్వారా మాత్రమే కాకుండా ఇతర పెంపుడు జంతువుల నుంచి కూడా వ్యాపిస్తుంది. మానవులకు ఎన్నిరకాల వ్యాధులు వస్తాయో అదే విధంగా జంతువులకు కూడా అనేక వ్యాధులు సోకుతుంటాయి. మానవుడు వారం రోజులు నోటిని శుభ్రం చేయకపోతే పళ్లపై గారపడుతుంది. ఆ సమయంలో ఇతరులను పళ్లతో కరిస్తే రేబిస్ వచ్చే అవకాశం వుందని వైద్యులు చెబుతున్నారు. జంతువులు ఎక్కువ సేపు ఆహారాన్ని నమిలితే వాటి పళ్లపై ఎటువంటి గార పట్టదు. ఆహారం తీసుకోని జంతువులకు రేబిస్ సోకుతుంది. రేబిస్ సోకిన జంతువు 14 రోజులకంటే ఎక్కువ జీవించదని పశు వైద్యుల అభిప్రాయం.

వ్యాక్సిన్ వేయించుకున్న వారికి రేబిస్ వ్యాపించదు. గతంలో హెపటైటిస్–బి, పోలియో వ్యాపించకుండా వుండేందుకు ముందుగా వ్యాక్సిన్ వేయించుకునేవారు. అదే విధంగా జంతువుల నుంచి రేబిస్ సోకకుండా వ్యాక్సిన్ వేయించుకోవాల్సి వుంటుంది. ఇందుకు సంబంధించిన ప్రచారం లేకపోవడంతో కుక్కగానీ, ఇతర జంతువులు కానీ కాటు వేసిన తర్వాత ఎఆర్‌వి(యాంటి రేబిస్ వ్యాక్సిన్) వేయించుకోవడం అలవాటుగా మారిపోయింది. సంవత్సరంలో మూడు దఫాలుగా ఈ వ్యాక్సిన్ వేయించుకుంటే ఆరోగ్యానికి మంచిదంటున్నారు వైద్యులు.

## కోతుల నుంచి కుక్కలకు...

ఇంతకు ముందు కోతుల నుంచి నక్కలకు, నక్కల నుంచి కుక్కలకు, కుక్కల నుంచి మనుషులకు రేబిస్ వ్యాపించేదని వైద్యులు చెప్పేవారు. ప్రస్తుతం పరిస్థితి అందుకు భిన్నంగా మారిపోయింది. కుక్క కాటువేసిన తర్వాతనే వైద్యం కోసం ఆసుపత్రికి వెళ్తుంటారు. కాటు వేసిన కుక్కకు రేబిస్ వుందో లేదో కూడా తెలుసుకోలేని పరిస్థితి. కాటు వేసిన కుక్కను గమనించమని వైద్యం అందించిన డాక్టర్ చెబుతుంటాడు. కరిచిన కుక్కకు రేబిస్ వుంటే 14 రోజులలోపల మరణిస్తుందని డాక్టర్ అభిప్రాయం.

## బొడ్డు చుట్టూ సూదులు

ప్రభుత్వ వైద్యశాలల్లో కుక్క కాటుకు సూది మందు వేసేవారు. ఈ సూది మందు ధర రూ2.50 పైసలు ప్రస్తుతం బయట వైద్యశాలల్లో వేసే వ్యాక్సిన్ 250 నుంచి 300 రూపాయల వరకు వుంటుంది. సూది మందును మనిషి బొడ్డు చుట్టూ 14 సార్లు వేస్తారు. వ్యాక్సిన్ మూడు సార్లు వేస్తారు. 14 సార్లు వేసే మందుకు 35 రూపాయలు చెల్లిస్తే సరిపోతుంది. ఈ వ్యాక్సిన్‌కు 900 రూపాయల వరకు చెల్లించాల్సి వుంటుంది. అయితే ప్రభుత్వం ప్రస్తుత పరిస్థితుల్లో అందరికీ సరిపడే వ్యాక్సిన్ సరఫరా చేయలేక పోతుంది. ఇందుకు కారణం ఆర్థిక వనరులు లేకపోవడమేనని భావించాల్సి వస్తుంది.

## ప్రచారం నిల్

జంతువులు కరిస్తే సోకే రేబిస్ గురించి ప్రభుత్వం కూడా ప్రజల్లో సరైన ప్రచారం చేయడం లేదు. రేబిస్ సోకకుండా ముందుగా వ్యాక్సిన్ వేయించుకోవాలన్న సమాచారాన్ని వైద్యులు అందించలేక పోతున్నారు. ముందుగా వ్యాక్సిన్ వేయించుకోని వారు కుక్క కాటుకు గురై వివిధ జిల్లాల్లో ఇటీవల మరణించారు. ప్రభుత్వ వైద్యశాలల్లో వ్యాక్సిన్ అందుబాటులో వుంచుకొని ప్రభుత్వం సరైన ప్రచారం నిర్వహించి వుంటే ముందుగా వ్యాక్సిన్ వేయించుకునే వారమని పలువురు వ్యాఖ్యానించారు. ఒక్క కుక్క మాత్రమే కాకుండా పిల్లి, ఎలుక కరిచినా కూడా రేబిస్ వచ్చే ప్రమాదముందని వైద్యులు చెబుతున్నారు.

వైద్య ఆరోగ్య శాఖ అధికారులతోపాటు ప్రజాప్రతినిధులు సైతం రేబిస్ గురించి ప్రస్తావించడం లేదు. ప్రస్తుతం రాష్ట్రవ్యాప్తంగా రేబిస్ మరణాలు చోటుచేసుకొంటున్నా రాష్ట్ర ప్రభుత్వం పెద్దగా స్పందించడం లేదు. విచ్చలవిడిగా వీధుల్లో తిరుగుతున్న కుక్కల్ని కాల్చివేయమని ఇటీవల జరిగిన ఒక సమావేశంలో నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి కార్పొరేషన్ అధికారులను ఆదేశించారు. అయితే జంతు ప్రేమికుల నుంచి నిరసన వ్యక్తమవుతుందన్న ఉద్దేశ్యంతో కమిషనర్ మౌనంగా వుండిపోయారు. కుక్కల్ని పట్టి కాల్చేయకుంటే అవి మనుషుల్ని కరుస్తాయి. కాల్చేస్తే జంతు ప్రేమికులు రోడ్లపై కొచ్చి ఆందోళన చేస్తారని అధికారుల భయం. తడలో పిచ్చి కుక్క ఒకటి గ్రామంలో పది మందిని వరుసగా పెరికిపెట్టింది. నెల్లూరులోనూ ప్రతి నిత్యం కుక్క కాట్లకు గురౌతున్న వారి సంఖ్య పెరుగుతూ వుంది. కుక్కలు పట్టించే విషయంలో నెల్లూరు కార్పొరేషన్ మీనమేషాలు లెక్కపెట్టడం విమర్శలకు తావిస్తోంది. జిల్లాలో రేబిస్ మరణాలు మొదలైన దృష్ట్యా ప్రభుత్వం అధికారులను అప్రమత్తం చేయాల్సి వుంది.



గూడూరులో జరిగిన రైతు సదస్సులో లబ్దిదారునికి ట్రాక్టర్‌ను అందిస్తున్న ఎమ్మెల్సీ వాకాటి నారాయణరెడ్డి, జిల్లా కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి. ప్రక్కన వేమారెడ్డి శ్యాంసుందర్‌రెడ్డి.




నెల్లూరు నర్తకి సెంటర్‌లో జరిగిన సినీనటుడు బాలకృష్ణ జన్మదిన వేడుకలలో మాట్లాడుతున్న వాటి నిర్వాహకుడు కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి. వేదికపై అనూరాధ, ఎమ్మెల్యే మస్తాన్‌రావు, రమేష్‌రెడ్డి, రవిచంద్ర తదితరులు.



విక్రమ సింహపురి యూనివర్సిటీ ప్రకటించిన డిగ్రీ మొదటి సంవత్సరం ఫలితాల్లో ఎంఎస్‌సిఎస్ గ్రూప్‌లో యూనివర్సిటీ టాపర్ చంద్రారెడ్డి డిగ్రీ కాలేజి విద్యార్థిని పి.త్రివేణిని అభినందిస్తున్న వైస్‌ఛాన్సలర్ విశ్వేశ్వరరావు, రిజిస్ట్రార్ నారాయణరెడ్డి. ప్రక్కన కాలేజి కరస్పాడెంట్ ప్రతాప్‌కుమార్‌రెడ్డి.



నెల్లూరు టౌన్‌హాల్‌లో జరిగిన బలిజ, కాపు, తెలగ వధూవరుల పరిచయ వేదిక కార్యక్రమానికి విచ్చేసిన జడ్పీ సిఇఓ జయరామయ్యను సన్మానిస్తున్న కోటేశ్వరరావు, మాజీ డిపిఆర్ఓ వెంకట రత్నం తదితరులు.

# కోటీశ్వరుల సేవలో రెవిన్యూశాఖ

## సిపిఐ నారాయణ చిటపట



జిల్లాలో రెవెన్యూ అధికారులు కూలీల కంటే హీనంగా కోటీశ్వరుల కోసం పని చేస్తున్నారని సిపిఐ రాష్ట్ర కార్యదర్శి కె.నారాయణ విమర్శించారు. సెజ్‌ల కోసం తమ విధులు విస్మరించి పారిశ్రామిక వేత్తలు, ధనవంతుల సేవలో తరిస్తున్నారన్నారు. తడలో సిపిఐ ఆధ్వర్యంలో ప్రజా సమస్యల పరిష్కార జాతాను ఆయన ప్రారంభించారు. ప్రభుత్వం రైతులకు నామమాత్రంగా నష్టపరిహారం చెల్లించి తీసుకొన్న భూములను సెజ్‌లకు ఇస్తున్నారని, నిర్వాహకులు వాటిని కోట్లకు అమ్ముకొంటున్నారని ఆరోపించారు. అటు రైతుకు నష్టం జరుగుతుందని, ఇటు ప్రభుత్వానికి లాభం జరగక మొత్తం ఆదాయం సెజ్‌ల నిర్వాహకులు సొంతం చేసుకొంటున్నారన్నారు. భూసేకరణ అధికారుల పాలిట కల్పతరువుగా మారిందని, పేద ప్రజల కష్టాలు, సమస్యలు పరిష్కరించాల్సిన రెవెన్యూ అధికారులు సెజ్‌ల యాజమాన్యాల వద్ద బానిసలుగా మారి వారి ప్రాపకం కోసం హీనంగా పని చేస్తున్నారని ఘాటుగా విమర్శించారు. తడ వద్ద గల పరిశ్రమల యజమానులు కార్మికుల పట్ల కక్షసాధింపు చర్యలకు పాల్పడుతున్నట్లు ఫిర్యాదులు అందుతున్నాయని అలాంటి వాటిపై దృష్టి సారించి కార్మికులకు అండగా నిలుస్తామన్నారు నారాయణ.

## బోగోలులో మంచినీటికి కటకట!

బోగోలు మండలంలో పలు గ్రామాలు మంచి నీటి సమస్యను ఎదుర్కొంటున్నాయి. నాగులవరం, విశ్వనాధరావుపేట పంచాయితీల పరిస్థితి మరీ అధ్వాన్నంగా వుంది. పంచాయితీలకు ఆదాయం లేక సమస్యలు పరిష్కరించలేక సతమతం అవుతున్నాయి. విశ్వనాధరావుపేటను పరిశీలించినట్లయితే నీటి సమస్య అధికంగా వున్నా ఏమీ చేయలేని స్థితి. మొత్తం 13 వార్డులున్న అక్కడ పన్నుల వసూళ్లు నిలచిపోయాయి. అధికభాగం ప్రజలు ప్రస్తుత సర్పంచ్‌పై రాజకీయ కక్ష సాధింపులో భాగంగా పన్నులు కట్టకుండా వుండగా, రైల్వే క్వార్టర్స్ వాళ్లు పన్నుల చెల్లింపు చేయరు. దీంతో పన్నులు వసూళ్లుకాక, ఆదాయం లేక మంచినీరును అందించలేక, చివరకు వీధిలైట్లను వేయించలేని దీనస్థితికి చేరుకొంది. ఇక నాగులవరం పంచాయితీ ప్రజలు ఇదే సమస్యను ఎదుర్కొంటున్నారు. 2,950మంది జనాభా వున్న ఈ ప్రాంతంలో వీధి లైట్లు లేవు. సైడు కాలువల నిర్మాణం జరుగలేదు. బోర్లు పనిచేయకపోవడంతో నీటి సమస్య తీవ్రంగా వుంది. పారిశుద్ధ్యం క్షీణించి వుంది. వీటి గురించి పలుమార్లు పంచాయితీ పాలకులకు, అధికారులకు తెలిపినా ఎవ్వరూ పట్టించుకోకపోవడంతో ఆయా గ్రామాల ప్రజలు సమస్యలతో సతమతం అవుతున్నారు.

## పామాయిల్ ఇవ్వరేమి?

### కావలి డివిజన్ అంతా ఇదే తీరు.

కావలి నియోజకవర్గంలోని వివిధ చౌకదుకాణాల్లో గత రెండు నెలలుగా నూనె సరఫరా నిలిపి వేయడంతో పేదలు ఇబ్బందులు పడుతున్నారు. తెల్లరేషన్ కార్డు గల వారికి ప్రభుత్వమే బియ్యం, నూనె, చక్కెర, కిరోసిన్‌లను అందజేస్తుంది. నిత్యావసర వస్తువుల పంపిణీ గత కొంతకాలంగా గాడి తప్పింది. సక్రమంగా వీటి సరఫరా వుండకపోవడంతో వినియోగదారులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. విధిలేని పరిస్థితుల్లో బజారులో అధిక ధరకు నూనె కొనుగోలు చేయాల్సి వస్తోందని వాపోతున్నారు. బోగోలు, అల్లూరు, దగదర్తి, కావలి మండలాల్లోని ప్రజలు దీనిపై అధికారులను కలసి విన్నవించుకొన్నా ఫలితం వుండడం లేదని వ్యాఖ్యానిస్తున్నారు. ఇక ఉదయగిరి, వరికుంటపాడు, సీతారాంపురం, మర్రిపాడు, దుత్తలూరు చౌకదుకాణాల్లో పరిస్థితి మరో విధంగా వుంది. ఈ ప్రాంతాల్లో అందుతున్న నిత్యావసర వస్తువుల్లో పురుగులు వుండడంతో వినియోగదారులు వాపోతున్నారు. పౌరసరఫరాలశాఖ అధికారులను దీనిపై అడిగితే ఎఫ్‌సిఐ వాళ్లు బియ్యం సరఫరా చేస్తున్నందున వారిని అడగమంటూ నిర్లక్ష్యంగా సమాధానం చెప్తున్నారని ఆవేదన చెందుతున్నారు ప్రజలు.

## కావలిలో పారిశుధ్యం హీనం!

కావలి పట్టణంలో పారిశుధ్య పరిస్థితులు నానాటికీ క్షీణించిపోతున్నాయి. పట్టణాభివృద్ధి సంగతి దేముడెరుగు చెత్తచెదారాలతో పట్టణం రూపురేఖలు కోల్పోతుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ప్రధానంగా ఇస్లాంపేట, శాంతినగర్, పుల్లారెడ్డినగర్, వెంగళరావు నగర్, వైకుంఠపురం తదితర ప్రాంతాల్లో పేడ దిబ్బలు, చెత్త కుప్పలు, మురికి గుంటలతో చూడ్డానికే అసహ్యకరంగా తయారయ్యాయి. తుమ్మలపెంట రోడ్డు, పెదపవని రోడ్డు, వెంగాయగారిపాళెం, ట్రంకురోడ్డులోనూ పారిశుధ్యం అధ్వాన్నంగా వుంది. ఈ రోడ్డు ప్రక్కన పేరుకపోయిన వ్యర్థాల మీదుగా వాహనాలు రాకపోకలు సాగిస్తుండడంతో దుర్గంధం వెదజల్లుతోంది. శివారు ప్రాంతాల్లో పరిస్థితి మరింత దిగజారిపోయింది. దుకాణదారులు వ్యర్థాలను రోడ్డుపైనే వేస్తుండడంతో కాలుష్యం వ్యాప్తి చెందుతోంది. కాలు వల్లో చెత్త చేరిపోయి, మురుగునీరు రోడ్లపైకి పొంగిప్రవహిస్తుండడంతో పట్టణ ప్రజలు పడుతున్న బాధలు అన్నిఇన్ని కావు. మునిసిపల్ మంత్రి పారిశుధ్య పరిస్థితిని మెరుగుపరచాలని ఆదేశించినా మునిసిపల్ అధికారులు స్పందించకపోవడంతో పట్టణ వాసులకు తిప్పలు తప్పడం లేదు.

## లెదర్ కాంప్లెక్స్ ఏర్పాటు ప్రశ్నార్థకం!

కృష్ణపట్నంలో లెదర్ కాంప్లెక్స్ ఏర్పాటు ప్రశ్నార్థకంగా మారింది. లిడ్‌క్యాప్ ఆధ్వర్యంలో 350 కోట్లతో ఈ కాంప్లెక్స్ ఏర్పాటుకు ఏడేళ్ల క్రితం అప్పటి ఎన్‌డిఏ ప్రభుత్వం అనుమతివ్వడంతో శంకుస్థాపన చేపట్టారు. కృష్ణపట్నం వద్ద బకింగ్‌హామ్ కెనాల్ – బంగాళాఖాతం మధ్య ఈ ప్రాజెక్టు కోసం 400 ఎకరాల భూమిని సేకరించారు. దీనిని ఏర్పాటు చేయడం వలన 500 మందికి ఉపాధి లభిస్తుందని అధికా

### సేకరించిన భూములు ఇతరులకు ధారాదత్తం

రులు ప్రకటన చేయడంతో ఈ ప్రాంత ప్రజలు ఎంతగానో సంతోషించారు. అయితే ఈ లెదర్ కాంప్లెక్స్ ఏర్పాటు శంకుస్థాపనతోనే నిలచిపోయింది. ఇటీవలకాలంలో ఆ ప్రాజెక్టు కోసం సేకరించి వుంచిన భూమిలో కొంత లైట్‌హౌస్ నిర్మాణ కోసం, మరికొంత భూమిని జెన్‌కో, రిలయన్స్ మధ్య బొగ్గు తరలించేందుకు మరో 150 ఎకరాలు కేటాయించారు. ఈ పరిస్థితుల్లో లెదర్ కాంప్లెక్స్ ఏర్పాటు ప్రశ్నార్థకమైంది. మరోవైపు దీనిని కోట మండలంలో ఏర్పాటు చేయనున్నారనే ప్రచారం జరుగుతోంది. మొత్తం మీద పలువురికి ఉపాధి కల్పించే ప్రాజెక్టుకు అతిగతి లేకుండా పోయింది.

# ముంగమూరు వెత తీరేదెన్నడో?



గత ఏడాది తుఫానుకు దెబ్బతిన్న బ్రిడ్జి.

వర్షాకాలం వచ్చిందంటే చాలు బోగోలు మండలం ముంగమూరు గ్రామప్రజలు హడలిపోతారు. చినుకుపడితే ఎక్కడ రాకపోకలు నిలచిపోతాయోనని ఆందోళన నెలకొంటుంది వారిలో. ముంగమూరులో గల బ్రిడ్జి గత ఏడాది సంభవించిన లైలా తుఫాను తాకిడికి కొట్టుకపోయింది. చుట్టూ నీరు చేరి రాకపోకలు తెగిపోవడంతో చుట్టుప్రక్కల ఏనుగుల బావి, కోళ్లదిన్నె, ముంగమూరు, అగ్రహారం, తెల్లగుంట గ్రామాల ప్రజలు 15రోజులు ఇతర ప్రాంతాలవారితో సంబంధాలు కోల్పోయారు. ఎప్పుడు వర్షం వచ్చినా ఇదే పరిస్థితి. గ్రామస్తుల దీన పరిస్థితి చూచి చలించిన ఎంపి రాజమోహన్‌రెడ్డి, మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, అప్పటి కలెక్టర్ రాంగోపాల్ బ్రిడ్జిని పరిశీలించి దాని మరమ్మత్తులకు ఆదేశించి చేతులు దులుపుకొన్నారు. నిధులు లేకపోవడంతో పనులు నిలిచిపోయాయి. తాత్కాలిక రోడ్డు వేసినప్పటికీ తర్వాత వచ్చిన జల్ తుఫాను దెబ్బకు ఈ రోడ్డు కొట్టుకుపోయింది. దాదాపు రెండేళ్లకుపైగా వాహనాలు తిరగలేక, బస్సులురాక ఐదు ప్రాంతాల ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నా పట్టించుకొన్నవారే కరువయ్యారు. తిరిగి వర్షాలు పడుతుండడంతో మళ్లీ ఏ ఉపద్రవం సంభవిస్తుందోనని ప్రజలు భయాందోళనలు వ్యక్తం చేస్తున్నారు. కలెక్టర్ శ్రీధర్‌రెడ్డి కూడా 14తేది ఈ బ్రిడ్జిని పరిశీలించారు.



నార్తుమోపూరువాసి దివంగత కాకాణి వేణుగోపాలరెడ్డి స్మృత్యర్థం చెన్నైకి చెందిన అభినయరెడ్డి ఇచ్చిన ఇరవై లక్షల విరాళాన్ని ప్రగతి ఛారిటీస్ సంస్థ అధ్యక్షుడు జెవి.రెడ్డికి అందిస్తున్న కాకాణి పొందురంగారెడ్డి.

## విజిలెన్స్ విచారణకు డిమాండ్!

### భూ ఆక్రమణలపై గొంతెత్తిన కురుగొండ్ల



వెంకటగిరి పట్టణంలో జరుగుతున్న భూఆక్రమణలపై విజిలెన్సు విచారణ జరిపించాలని ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ డిమాండ్ చేశారు. తహశీల్దార్ కార్యాలయానికి వచ్చిన ఆయన భూ ఆక్రమణలపై ఫిర్యాదులు వెల్లువెత్తుతున్నాయని వీటిపై ఏమీ చర్యలు తీసుకొన్నారని అధికారులను ప్రశ్నించారు. కొంతమంది బడాబాబులకు రెవెన్యూ అధికారులు అండదండలు అందిస్తున్నందునే ఇలాంటివి అధికం అవుతున్నాయన్నారు. పాత ఎమ్మార్వోల సంతకాలతో పట్టాలు పుట్టుకొస్తున్నాయని ఆరోపించిన ఆయన కుమ్మరగుంట, మనులాల్‌పేట, రైల్వేగేటు, చెవిరెడ్డిపల్లి, టీచర్స్ కాలనీలో ఆక్రమణలు జోరందుకొన్నాయన్నారు. ఈ సందర్భంగా మునిసిపల్ సిబ్బంది, రెవెన్యూ సిబ్బంది తీరును తప్పుపట్టారు. ఎన్నికల్లో ఓడిపోయిన వారు పెత్తనం చెలాయిస్తున్నారని కొందరు అధికారులు వారికి కొమ్ము కాస్తున్నారని ఆగ్రహించిన రామకృష్ణ ఇప్పటికైనా అధికారులు పద్ధతి మార్చుకోవాలని సూచించారు.

## వెంకటగిరిలో తాగునీటికి కటకట!

వెంకటగిరి నియోజకవర్గంలోని పలు గ్రామాల్లో తాగునీటికి ప్రజలు అల్లాడిపోతున్నారు. నీటి పథకాలు మూలనపడడంతో ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. అధిక భాగం నీటి పథకాలు మరమ్మత్తుకు గురైనా వాటి బాగోగులు అధికారులు పట్టించుకోవడం లేదు. ఈ ప్రాంతంలో 3851బోర్లు, మినీ రక్షిత మంచినీటి పథకాలు 74వున్నాయి. పంచాయితీల నిర్వహణా లోపం, అధికారులు నిర్లక్ష్యం ప్రజలపాలిట శాపంగా మారింది. కలవలపూడి, మొక్కలపాడు, చెలికంపాడు, పాపమాంబాపురం తదితర గ్రామాల్లో మినీ రక్షితనీటి పథకాలు నెల తరబడి మరమ్మత్తులకు గురైవున్నాయి. బాలసముద్రం నీటి పథకానికి విద్యుత్ సౌకర్యం లేదు. శివలింగాపురం, విశ్వనాథపురం గిరిజన కాలనీల్లో మోటార్లు పనిచేయడం లేదు. పాళెంకోట దళితవాడలోనూ ఇదే పరిస్థితి. వల్లివేడు, పెట్లూరు, గొట్టగుంట తదితర గ్రామాల్లో బోర్లు చెడిపోయి వుండడంతో ప్రజలు తీవ్ర ఇబ్బందులుపడుతున్నారు.

● శిథిలావస్థలో

## ప్రభుత్వ కార్యాలయాలు!

కావలి డివిజన్‌లో ప్రభుత్వ కార్యాలయాల పరిస్థితి దయనీయంగా వుంది. శిథిలమైపోయిన కార్యాలయాలు అధికంగా వుండడంతో వర్షాకాలం పనికిరాకుండా పోతున్నాయి ఈ కార్యాలయాలు. కావలి పట్టణంలో గల మండల కార్యాలయం, బోగోలులోగల మండల కార్యాలయాలే ఇందుకు ఉదాహరణ. ఆర్డీఓ కార్యాలయం, ఎమ్మార్వో ఆఫీసులు చినుకుపడితే అంతా ఉరుపే. కార్యాలయ సిబ్బంది తలదాచుకోవడం అటుంచి రికార్డులు భద్రపరిచేందుకు, కంప్యూటర్లు తడవకుండా

### కావలి, బోగోలులో పరిస్థితిది.

జాగ్రత్త చేసేందుకు నానా తంటాలు పడాల్సి వస్తోంది. ఎక్కడా నిలుచునేందుకు వీలులేని పరిస్థితులు తలెత్తుతున్నాయి వానొచ్చిందంటే. తహశీల్దార్ గదిలో సైతం కూర్చొనే అవకాశం వుండడం లేదు. ఈ పరిస్థితులలో వివిధ సమస్యలపై వచ్చే ప్రజలు గురించి పట్టించుకోకుండా వారిపై ఆగ్రహం వ్యక్తం చేస్తున్న ఘటనలు జరుగుతున్నాయి. ఉన్నతాధికారులు స్పందించి ప్రభుత్వ కార్యాలయాలకు మరమ్మత్తులు చేయించాల్సి వుంది.

## చెరువుల దురాక్రమణ

వెంకటగిరి నియోజకవర్గంలో గల చెరువులు ఆక్రమణ చెర చిక్కుతున్నాయి. రాజాల కాలంలో నిర్మించిన ఈ చెరువులతో పట్టణ ప్రాంతాలలో భూగర్భ జల మట్టాలు నిలకడగా వుండేవి. అలాంటి చెరువులు నేడు కొంచెం కొంచెంగా ఆక్రమణలకు కొంతమంది రియల్ ఎస్టేట్ వ్యాపారులు చెరువుల స్థలాలను తమ స్థలాల్లో కలుపుకొని ప్లాట్లు వేసి అమ్మకాలు సాగిస్తున్నా అడ్డుకొనే అధికారే లేకుండా పోయాడు. అమ్మవారిపేట చెరువు పూర్తిగా రూపురేఖలు కోల్పోయింది. పోలిశెట్టిగుంట వరవ కాలువపైన అక్రమ కట్టడాలు వెలి

### వెంకటగిరిలో చోద్యం చూస్తున్న అధికారులు

గురవుతున్నాయి. పట్టణ పరిధిలోనికి అమ్మవారిపేట, మనులాలపేట, చెవిరెడ్డిపల్లి చెరువులు ఆక్రమణలకు గురై వున్నాయి. చెరువులోతట్టు ప్రాంతాన్ని ఆక్రమించి వేస్తున్నారు. అంతేకాకుండా చెరువుల్లోని మట్టిని తరలించుకపోతుండడంతో చెరువులు మెల్లగా కనుమరుగై పోతున్నాయి. సినా చర్యలు తీసుకోక పోవడంతో ఆక్రమణలు రోజురోజుకు అధికం అవుతున్నాయి. పట్టణంతోపాటు మండలంలోని బాలసముద్రం, సిద్ధవరం, పాలకొండ సత్రం, పాళెంకోట, పెట్లూరు తదితర చెరువులతోపాటు దక్కిళి, బాలాయపల్లి చెరువుల పరిస్థితి ఇలాగే వుంది.

## ఆర్థిక మంత్రిని నిలదీసిన రైతులు!

### ఆత్మకూరులో వింత అనుభవం

ఆత్మకూరులో జరిగిన రైతు సదస్సులో ఆర్థికమంత్రికి రైతుల నుంచి తీవ్ర నిరసన వ్యక్తమయ్యింది. రైతు సదస్సుకు హాజరైన మంత్రి ఆనం రామనారాయణరెడ్డి మాట్లాడుతూ రైతులు ఆధునిక వ్యవసాయ పరిజ్ఞానాన్ని అందిపుచ్చుకోవాలన్నారు. శాస్త్రీయ పద్ధతిలో వ్యవసాయం చేస్తే అధిక దిగుబడులు సాధించవచ్చన్నారు. మంత్రి మాటలతో సదస్సుకు హాజరైన రైతులు ఒక్కసారిగా లేచారు. అయ్యా మంత్రిగారు మేము మీరు చెప్పిన పద్ధతుల్లోనే వ్యవసాయం చేస్తున్నాం. అధిక దిగుబడి సాధించాం కానీ ఏం లాభం ధాన్యం కొనే దిక్కు లేదు. గిట్టుబాటు ధర లేదు. పేరుకే మీరు కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేశారు. వాటివలన మాకు ఒనకూరిందేమీ లేదు. గత్యంతరం లేక వ్యాపారులు, మిల్లర్లు అడిగిన రేటుకు తెగనమ్ముకొంటున్నాం అంటూ వివరించారు. ప్రభుత్వం రైతులను విస్మరిస్తోంది. మీరేమో ఆధునిక వ్యవసాయం అంటున్నారు మా బాధ వినండి, మా కష్టం చూడండి అంటూ రైతులు తమ గోడు వెళ్లబోసుకొన్నారు. సదస్సుకు విచ్చేసిన మాజీ శాసనమండలి సభ్యుడు బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి రైతులకు గిట్టుబాటు ధర కల్పించాల్సిన అవసరం ఎంతైనా వుందని రైతుల పక్షాన మాట్లాడడంతో ఆధునిక వ్యవసాయం గురించి మాట్లాడుతున్న మంత్రి ఆనం ఈ పరిణామంతో నిశ్చేష్టుడయ్యాడు.

## ఇందిరమ్మ ఇళ్లకు ప్రతిబంధకం!

### పెరిగిన స్టీలు, సిమెంట్ ధరలు

పెరుగుతున్న గృహనిర్మాణ సామాగ్రి ధరలు ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణాలకు ప్రతిబంధకంగా మారుతున్నాయి. సిమెంటు, స్టీలు ధరలు విపరీతంగా పెరిగిపోతుండడం, ప్రభుత్వ సాయం అందకపోవడంతో పలు ప్రాంతాల్లో ఇళ్ల నిర్మాణాలు అర్ధాంతరంగా నిలచిపోతున్నాయి. దీనికితోడు బిల్లుల చెల్లింపుల్లో అధికారులు తీవ్ర జాప్యం చేస్తుండడంతో లబ్ధిదారుల పరిస్థితి ఆగమ్యగోచరంగా తయారైంది. ఆరు నెలల క్రిందట 53గ్రేడ్ సిమెంట్ బస్తా ధర 160 రూపాయలు నుంచి 180 రూపాయల వరకు వుండగా, ప్రస్తుతం 280 వరకు పలుకుతోంది. అదే విధంగా స్టీలు ధరలు అమాంతంగా పెరిగిపోయాయి. టన్ను స్టీలు ధర 36వేల నుంచి 44 వేలకు చేరుకొంది. ఇటుకల ధరలు, వాహనాల అద్దె పెరగడంతో ఇంటి నిర్మాణం లబ్దిదారులకు కష్టంగా మారింది. లబ్దిదారులను ఆదుకోవాల్సిన బ్యాంకులు సకాలంలో రుణాలను మంజూరు చేయకపోవడంతో జిల్లావ్యాప్తంగా వివిధ ప్రాంతాల్లో గృహనిర్మాణాలు నిలచిపోతున్నాయి.

# అవివాహితులకు మంచి చేసే రంభావ్రతం!

మహిళలు ఆచరించదగు వ్రతాలలో జ్యేష్ఠమాసం శుద్ధ తదియనాడు ఆచరించే 'రంభా వ్రతం' అత్యంత ప్రధానమైనది. అవివాహితులు వివాహం జరిగి మంచి భర్తను పొందేందుకు, వివాహితులు పుత్రప్రాప్తికి, సౌభాగ్యవృద్ధికి, అన్యోన్యదాంపత్యసిద్ధికి చేపట్టే వ్రతం ఈ రంభా వ్రతం.

రంభ అంటే అరటిచెట్టు అని అర్థం. అరటిచెట్టు మొదలు వద్ద నిర్వహించే వ్రతం కనుక దీనికి రంభావ్రతం అనీ, జ్యేష్ఠశుద్ధ తదియనాడు చేసే వ్రతం కాబట్టి రంభా తృతీయ వ్రతం అని కూడా అంటారు.

పార్వతిదేవి హిమవంతుని పుత్రికగా జన్మించి పరమేశ్వరుని పతిగా పొందుటకు తపోదీక్ష చేసినా తగిన ఫలితం దక్కని సందర్భంలో భృగుమహర్షి పార్వతి మనోవాంఛను గుర్తించి ఆమెకు ఈ రంభా వ్రత మహిమను వివరించి వ్రతం ఆచరించవలసిన విధానాన్ని తెలియజేసినట్లు పురాణ కథనం. మహర్షి సూచన మేరకు పార్వతి రంభావ్రతాన్ని జ్యేష్ఠశుద్ధ తదియనాడు నిష్ఠాగరిష్ఠురాలై ఆచరించిన ఫలితంగానే శివుని భర్తగా పొందగలిగిందట.

ఈ వ్రతం విశేషాలు భవిష్య పురాణంలో చెప్పబడింది. జ్యేష్ఠశుద్ధ తదియనాడు సూర్యోదయానికి ముందే నిద్ర లేచి అభ్యంగన స్నానమాచరించి సమీపంలోని అరటితోటలో గాని, పెరటిలోని అరటిచెట్టు వద్దకు వెళ్లి చెట్టుక్రింద శుభ్రపరచి నీళ్లు చల్లి ముగ్గుపెట్టాలి. అరటిచెట్టుకు పసుపు కుంకుమలను అలంకరించి చెట్టు మొదలు గౌరీదేవికి ప్రతీకగా భావించి సావిత్రిదేవి ప్రతిమను ప్రతిష్ఠించి వడపప్పు, పాయసం నివేదించాలి. షోడశోపచారాలతో పూజ చేసి ఆనాడు ఉపవాసం వుండాలి. పూజానంతరం దంపతులకు ఫలతాంబూలాలను ఇచ్చి ఆశీస్సులు అందుకోవాలి. మరుసటిరోజు ఉపవాసం ముగించడంతో వ్రతదీక్ష ముగుస్తుంది. ఈ రంభావ్రతాన్ని ఆచరించడం వలన వివాహం జరిగి అనుకూలమైన భర్త లభిస్తారని, కుటుంబంలో సుఖసంతోషాలు కల్గుతాయని ప్రతీతి.

# రాజకీయ పైరవీలతో ఐఏఎస్‌ల బదిలీలు



ఎన్నాళ్ల నుంచో ఎదురుచూస్తున్న ఐఎఎస్‌ల బదిలీలు జరిగిపోయాయి. అయితే వీటిపై సిఎం కిరణ్ 'ముద్ర' కంటే రాజకీయ నాయకుల పైరవీల ప్రభావమే ఎక్కువగా వుంది. అధికారి సమర్థత, నీతి నిజాయితీలను బట్టి కాకుండా సిఫార్సుల ద్వారా బదిలీలు జరిగాయంటూ సచివాలయంలో చెవులు కొరుక్కొంటున్నారు. ఆర్థికశాఖ ముఖ్య కార్యదర్శి సుధీర్‌కు మంచి పేరుంది. ఆయనను 'కీలక'శాఖ నుంచి తప్పించి వైద్య ఆరోగ్యశాఖకు పంపడం విమర్శలకు దారి తీసింది. రోశయ్య ఆర్థిక మంత్రిగా, సిఎంగా వున్నప్పటి నుంచి సుధీర్ ఆర్థికశాఖ కార్యదర్శిగా వున్నాడు. కేవలం సుధీర్‌నే కాకుండా ఆయన టీం మొత్తాన్ని గంపగుత్తగా బదిలీ చేశాడు సిఎం. తన మాట విననందుకే ఇలా చేశాడా? లేక రోశయ్యపై వున్న కోపంతో చేశాడా? అన్నదానిపై ఐఎఎస్‌లు చెవులు కొరుక్కుంటున్నారు. కాగా కడపజిల్లా కలెక్టర్‌గా వున్న శశిభూషణ్‌పై ఊహించినట్లుగానే 'వేటు' పడింది. ఉప ఎన్నికల సందర్భంగా కలెక్టర్ సహకరించ లేదన్నది సిఎం కోపం. గత ఎమ్మెల్సీ ఎన్నికల సందర్భంగా కూడా చిత్తూరు జాయింట్ కలెక్టర్ ప్రద్యుమ్న సహకరించ లేదన్న నేపంతో సిఎం బదిలీ వేటు వేశాడు. కడప కలెక్టర్‌ను గోళ్లుగిల్లుకునే 'శాప్'కు ఎండీగా వేశారు. ప్రద్యుమ్న ఇప్పటికే రైతుబజార్ సిఇఓగా గోళ్లుగిల్లుకుంటున్నాడు. వైఎస్ సిఎంగా వున్నప్పుడు కడప కలెక్టర్‌గా ఓ వెలుగు వెలిగిన కృష్ణబాబును గ్రేటర్ హైదరాబాద్ కమిషనర్‌గా వేశారు. రాజకీయ సిఫార్సు బాగా పని చేసినందువల్లే కృష్ణబాబుకు 'మహా'నగర యోగం పట్టిందంటున్నారు.

# గాంధీభవన్‌లో నెల్లూరీయుల గోల




బొత్సా సత్యనారాయణ పుణ్యమా అంటూ ఇప్పుడు నెల్లూరీయుల 'గోల' ఎక్కువైందంటూ గాంధీభవన్ వర్గాలు మొత్తుకుంటున్నాయి. బొత్సా సత్యనారాయణ పిసిసి అధ్యక్షుడయ్యాక ఆయనకు సన్నిహితంగా వుండే మాదాసు గంగాధరం, ఆనం రామనారాయణ హడావుడి ఎక్కువైంది. పిసిసి అధ్యక్ష బాధ్యతలు తీసుకునే సందర్భంగా మాదాసు, రామనారాయణ దగ్గర వుండి 'తతంగం' నడిపారు. దీంతో గాంధీభవన్ వర్గాలకు చిర్రెత్తిపోయింది. ఎప్పుడూ లేనిది 'ఇదేం గోలరా బొత్సా' అంటూ వారంతా బిక్క మొహాలేస్తున్నారు. బొత్సా సామాజిక వర్గంగా చెప్పుకొంటూ మాదాసు తన హవా కొనసాగిస్తున్నాడు. కాగా గత ఏడాదిగా సన్నిహితంగా వుండటం రామనారాయణకు కలిసొచ్చింది. సిఎం కిరణ్‌తో కొంతకాలంగా ఎడ మొహం పెడ మొహంగా వున్న నారాయణకు బొత్సా రూపంలో 'మద్దతు' లభిస్తుందా? లేక మంత్రివర్గ మార్పుల్లో కిరణ్ కన్నెర్రకు గురికావాల్సి వస్తుందా? అన్నది ఇప్పుడు రాజకీయ వర్గాల్లో వేడివేడి చర్చ జరుగుతోంది. చూద్దాం! నారాయణ భవిష్యత్తు ఎలా వుండబోతోందో.




# జగన్ పార్టీలో సలహా'దారుల' హవా!



వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీలో ఇప్పుడు సలహాదారుల హవా నడుస్తోంది. వై.ఎస్ సిఎంగా వున్నప్పుడు రాష్ట్రప్రభుత్వ సలహాదారులుగా నియమితులైన డి.ఎ.సోమయాజులు, సిసిరెడ్డి ఇటీవలే ఆ పదవులకు రాజీనామా చేసి వైఎస్సార్ కాంగ్రెస్‌లో చేరారు. అక్కడ కూడా వీరిద్దరికి సలహాదారుల పదవులే దక్కాయి. సి.సిరెడ్డికి వైఎస్ కుటుంబంతో బంధుత్వముంది. వైఎస్ సిఎంగా వున్నప్పుడు ఆయన ఇమేజ్‌ను పెంచేందుకు బ్రహ్మానందం హీరోగా ఓ మాటలు లేని 'మూగ' సినిమాను కూడా ప్రారంభించాడు. వైఎస్ కూడా ఈ చిత్రంలో సిఎంగా కనిపిస్తాడు. అయితే ఈ సినిమా అర్థంతరంగా ఆగిపోయింది. వైఎస్ మరణం తర్వాత సిసిరెడ్డి ఈ సినిమా ఊసేఎత్త లేదు. ఇప్పుడు జగన్ శిబిరంలో చేరాక వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ ప్రచారానికి సరికొత్త వ్యూహాన్ని రూపొందిస్తున్నట్లు చెప్పుకొంటున్నారు. ప్రభుత్వ సలహాదారుగా వున్న ఆరేళ్లకాలంలో ఎప్పుడూ నోరువిప్పని సిసిరెడ్డి జగన్ పార్టీలో చేరాక మాత్రం క్రియాశీలకంగా వుంటున్నాడు. రోజుకో ప్రెస్ కాన్ఫెరెన్స్, వారానికో సమీక్ష లేనిదే నిద్రపోవడం లేదట. మరో సలహాదారుడు సోమయాజులు కూడా జగన్ పార్టీలో చేరాక రెచ్చిపోతున్నాడు. వైఎస్సార్‌కు రాజకీయ ప్రసంగాల దగ్గర నుంచీ బడ్జెట్ పథకాల రూపకల్పన వరకు సోమయాజులు చొరవ తీసుకునేవాడు. ప్రస్తుతం కాంగ్రెస్‌పార్టీపై దుమ్మెత్తి పోయడానికి ఒంటికాలి మీద లేస్తున్నాడు. అయితే కెవిపి రామచంద్రరావుకు అత్యంత సన్నిహితుడన్న 'ముద్ర' వుండటం సోమయాజులుకు మైనస్‌గా మారింది. దీంతో ఆ ముద్రను చెరిపేసుకోడానికి రెచ్చిపోతున్నాడని వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీలో చెవులు కొరుక్కుంటున్నారు. అయితే సోమయాజుల్ని కోవర్ట్‌గా కెవిపినే జగన్ పార్టీలోకి పంపాడని రాజధానిలో పుకార్లు షికార్లు చేస్తున్నాయి. వింటున్నావా! జగన్!

# అవినీతి 'సుకుమారుడి'కి సిఎం అండ



అవినీతి చక్రవర్తిగా ఆరోపణల్ని ఎదుర్కొంటున్న వ్యవసాయ మార్కెటింగ్‌శాఖ కమిషనర్ ఎ.ఆర్.సుకుమార్‌కు సిఎం అండదండలు పుష్కలంగా వున్నాయట. మార్కెటింగ్‌శాఖలో చేరి నాలుగో సంవత్సరం గడుస్తున్నా కూడా సుకుమార్‌కు బదిలీ జరగ్గపోవడం వెనుక సిఎం ఆశీస్సులున్నట్లు సచివాలయ వర్గాలు చెవులు కొరుక్కుంటున్నాయి. సాధారణంగా రెండేళ్లు నిండిన ఐఎఎస్ అధికారికి స్థాన చలనం తప్పనిసరి. ఇక నిజాయితీ నిబద్ధతతో పనిచేసే వారిని ఆర్నెల్లలోనే శంకరగిరి మాన్యాలు పట్టిస్తుంటారు. కానీ ఎసిబి, లోకాయుక్త, విజిలెన్స్ తదితర శాఖల్లో కుప్ప తెప్పలుగా అవినీతి ఆరోపణలున్న సుకుమార్‌కు మాత్రం బదలీ జరగటం లేదు. తమిళనాడుకు చెందిన ఈయన రాజకీయాన్ని బట్టి 'రంగు'మారుస్తుంటాడు. తెలుగుదేశం ప్రభుత్వం వున్నప్పుడు చంద్రబాబు శిబిరంలో చేరి హార్టికల్చర్‌శాఖలో ఏకంగా ఎనిమిదేళ్లు 'రాజ్యం' చేశాడు. సామాజిక వర్గం అంటూ రోశయ్య దగ్గర చేరి మార్కెటింగ్ చేసుకుంటూ బదలీని నిలుపుకున్నాడు. ఇప్పుడు 'చిదంబరం' బంధువునంటూ సిఎం దగ్గర ప్రాపకం పెంచుకుంటున్నాడు. మాజీ స్పీకర్ సురేష్‌రెడ్డి ద్వారా సిఎంకు సిఫార్సు చేయించుకొని మార్కెటింగ్‌శాఖలోనే పాతుకుపోతున్నాడు. పైసల్లేనిదే ఫైలు కూడా ముట్టని ఘన చరిత్ర వున్న సుకుమార్‌తో ఆశాఖ ముఖ్యకార్యదర్శి రత్నకిషోర్ కూడా తలబాదుకుంటున్నాడట. సుకుమార్‌ను బదిలీ చేయండి బాబూ అంటూ స్వయంగా చీఫ్ సెక్రటరీని కలిసి మొత్తుకుంటున్నా కూడా ఫలితం శూన్యం అంటూ కనబడిన వారికల్లా చెప్పుకుంటూ పెదవి విరుస్తున్నాడట. రత్నకిషోర్... ఏం చేద్దాం చెప్మా!

● ఉప్పు నిప్పుగా

# ముఖ్యమంత్రి, ఆర్థికమంత్రుల మధ్య సంబంధాలు!



రాష్ట్ర ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణ రెడ్డికి, ముఖ్యమంత్రి కిరణ్ కుమార్ రెడ్డికి మధ్య దూరం రోజురోజుకీ పెరిగి పోతున్నది. ఇద్దరూ ఎడ ముఖం పెడ ముఖం చూసుకొనే పరిస్థితి తలెత్తుతున్నది. గత కొంతకాలంగా ఈ విషయంలో పుకార్లు వున్నప్పటికీ, రెండు రోజుల క్రితం జరిగి ఐఎఎస్ అధికారుల బదలీలు దాన్ని దృవపరుస్తున్నాయి.

ఆనం సోదరులు రాజకీయంగా మహా చతురులు. పని కానిచ్చుకోవడమనే లౌక్యం తప్ప ఆత్మ గౌరవం, విశ్వాసం, విధేయత, కృతజ్ఞత వంటి పదాలు వారి నిఘంటువులో వుండవు. నమ్మిన వాడిని, సహాయం చేసిన వాడిని నట్టేట ముంచడంలో అన్నదమ్ములిద్దరూ ఒకరికి ఒకరు తీసిపోని ఘనాపాటీలు. పాత చరిత్ర అవసరం లేదు. కొత్త సంఘటనలు చూసినా, వైఎస్.రాజశేఖర్‌రెడ్డి వారికి రాజకీయంగా దేముడితో సమానం. మంత్రి పదవి ఇచ్చాడు, ఏడు తరాలు తిన్నా తరగని సంపద దోచుకొని, దాచుకొనేందుకు అవకాశం ఇచ్చాడు, అడిగిన ప్రతి కోరిక తీర్చాడు. కానీ ఆయన కన్ను మూయగానే ఆయన చేసిన ఉపకారాలు వారికి మరపుకు వచ్చేశాయి. ఆయన వారసుడిగా వచ్చిన జగన్ మీద ఒంటి కాలితో కయ్యానికి వెళ్లడం ఆ మరపు ఫలితమే. కిరణ్‌కుమార్ రెడ్డి కూడా వైఎస్ కంటే ఒక మెట్టు ఎక్కువగా రామనారాయణరెడ్డికి ఆర్థికమంత్రిత్వం బహూకరించి, నంబర్ టూ అన్పించుకొనే అవకాశం ఇచ్చాడు. కానీ అన్నం పెట్టిన చేతిని నిలువునా నరకడమే తమ రాజకీయ విజయ రహస్యం అని భావించే ఆనం సోదరులు, ఆ పక్కరోజు నుంచీ కిరణ్ కాళ్ల క్రింద గోతులు త్రవ్వడం మొదలు పెట్టారు. కడప ఉప ఎన్నిక ఇన్‌ఛార్జిగా వెళ్లి, పరోక్షంగా జగన్‌కు సహకారం అందించారు. ఆ ఎన్నికలో కాంగ్రెస్ ఘోరంగా ఓడిపోతే ఢిల్లీ పెద్దలు కిరణ్‌కుమార్ రెడ్డిని దించి, తనను ఎక్కిస్తారేమో అన్నది రామనారాయణ రెడ్డి ఆశ. దానికి తగినట్లే కెవిపి రామచంద్రరావు ద్వారా ఢిల్లీలో తన పేరు వినపడేట్లు చూసుకోవడానికి నానా తంటాలు పడ్డాడు రామనారాయణ. ఇవన్నీ కిరణ్‌కు చిరాకు తెప్పించాయి. ఎక్కడో దగ్గర కత్తెరకు పని చెప్పాలని, ఢిల్లీలో జరిగే ప్రణాళికా సంఘం సమావేశానికి ఆర్థికమంత్రి లేకుండా తానొక్కడే వెళ్లాడు. హైదరాబాదులో జరిగిన బ్యాంకర్ల సమావేశానికీ ఆర్థికమంత్రికి ఆహ్వానం లేదు. ఇప్పుడు తాజాగా ఆర్థిక శాఖలో వున్న ఉన్నతస్థాయి ఐఎఎస్ అధికారులందరినీ ఒక్కసారిగా బదలీ చేశాడు ముఖ్యమంత్రి. స్పెషల్ చీఫ్ సెక్రటరీ సుధీర్, ప్రిన్సిపల్ సెక్రటరీలు వసుధామిశ్రా, ఎల్‌వి సుబ్రహ్మణ్యం, సెక్రటరీ శేఖర్ బాబులను చెప్పాపెట్టకుండా బదలీ చేశాడు ముఖ్యమంత్రి. వారి స్థానంలో ప్రేమచంద్రారెడ్డి, భాస్కర్ వంటి నిక్కచ్చి అధికారులను నియమించాడు. తనకు మాట మాత్రం చెప్పకుండా తన శాఖ మొత్తాన్ని ప్రక్షాళన చేయడం, ఎవరి మాట వినని అధికారులను తన శాఖకు కేటాయించడం రామనారాయణరెడ్డికి తీవ్ర ఆగ్రహం తెప్పించింది. కానీ ముఖ్యమంత్రిని ఏమి చేయగలడు? ఆ అక్కసంతా కొత్త పిసిసి అధ్యక్షుడు బొత్సా సత్తిబాబు ముందు వెళ్లగ్రక్కాడు. సత్తిబాబుకు కూడా రామనారాయణ రెడ్డి అంటే లోలోపల ఒళ్లు మంట. కానీ ఇప్పుడు పార్టీ పెద్ద స్థానంలో వున్నాడు కాబట్టి, నేను ముఖ్యమంత్రితో మాట్లాడి సర్దుబాటు చేస్తానని కన్నీళ్లు తుడిచి పంపించాడు.

ఈ బదలీలతో ముఖ్యమంత్రికి, ఆర్థికమంత్రికి

కొరవ 14వ పేజీలో

## చిరుకు ఇప్పుడేమీ ఇవ్వరా?



ప్రజారాజ్యం పార్టీని కాంగ్రెస్‌లో విలీనం చేసినందుకు చిరంజీవికి పెద్ద పదవి దొరుకుతుందని అందరూ భావించారు. అది సహజం కూడా. ఆయన్ను కేంద్రంలో మంత్రిని చేస్తారని, మంచి శాఖ ఇస్తారని ప్రచారం జరిగింది. చిరంజీవి కూడా ఆ ఆశతోనే వున్నాడు. అత్యాశకు పోయి ఏకంగా రైల్వే మంత్రిత్వ శాఖ అడిగారాయన. అయితే ఢిల్లీ వార్తల తీరు చూస్తే, చిరంజీవికి ఇప్పట్లో ఏమీ ఇవ్వరన్న భావన కల్గుతున్నది. ఆయన్ను కేంద్ర మంత్రివర్గంలోకి తీసుకొంటే, తిరుపతి శాసనసభ స్థానానికి ఉప ఎన్నిక తప్పనిసరి అవుతుంది. జగన్‌కు ప్రజలలో వున్న ఆకర్షణ రీత్యా ఆ ఉప ఎన్నికలో కాంగ్రెస్ గెలవడం అసంభవం. ఆ ఓటమి అటు చిరంజీవికి, ఇటు కాంగ్రెస్ పార్టీకి కూడా పెద్ద సంకటంగా మారుతున్నదన్నది నిజం. ఆ ప్రమాదం తప్పించుకోవాలంటే, చిరంజీవిని కొంతకాలం ఖాళీగా పెట్టడమే ఉత్తమమని ఢిల్లీ పెద్దలు భావిస్తున్నారట. ఆయన పార్టీ వారికి రెండో మూడో మంత్రిత్వాలు రాష్ట్రంలో ఇచ్చి సరిపెడతారని చెప్తున్నారు. పాపం, చిరంజీవి.

## ట్రంకు రోడ్డు



### న్యాయవాదుల ఝులక్

నెల్లూరులో అభివృద్ధి కార్యక్రమాలు ఎంత నాసిరకంగా జరుగుతున్నా అడిగే నాధుడు లేకపోవడంతో మునిసిపల్ కాంట్రాక్టర్లు కొత్త కార్పొరేషన్ ఆఫీసు క్కూడా మాసం రోజుల్లో లేచిపోయేలా తారు రోడ్డు వేశారు. ఇదే తరహాలో జిల్లా కోర్టు ప్రాంగణంలో రోడ్డును వేస్తుండిన కాంట్రాక్టర్‌ను న్యాయవాదులు అడ్డుకొన్నారు. బూడిద సిమెంట్‌తో రోడ్డు వేస్తే ఎలానంటూ కమిషనర్‌కు ఫోను చేశారు. ఆయన కార్పొరేషన్ ఎస్‌ఇ సూర్యజ్యోతిని పరిశీలనకు పంపారు. ఆమెకు ఎంత సుందరముదనష్టంగా రోడ్డు వేశారో తెలియదా? తెలివిగా తప్పించుకోను క్వాలిటీ కంట్రోల్ అధికారుల చేత తనిఖీ చేయిస్తానన్నారు. మొత్తానికి నగరంలో నాసిరకం రోడ్డు నిర్మాణ పనులను ఆపి న్యాయవాదులు వార్తలలోని వ్యక్తులయ్యారు.

### బాలయ్య భజన!

నెల్లూరులో ఎప్పుడూలేనట్లుగా సినీ నటుడు బాలకృష్ణ జన్మదినోత్సవాన్ని ఘనంగా జరిపారు. అభిమానుల ప్రదర్శన, బహిరంగసభ, పలువురికి ప్రోత్సాహకాలు, సహాయాలు అందజేశారు. నర్తకి సెంటర్‌లో జరిగిన సభలో బీద బ్రదర్స్ మస్తాన్‌రావు, రవిచంద్ర బాలకృష్ణ భజన చేయడం చర్చనీయాంశమయ్యింది. కావలి ఎమ్మెల్యేగా నేను గెలవడానికి బాలకృష్ణ ప్రచారం చేయడం కారణం. తెలుగు యువత రాష్ట్ర అధ్యక్షుడుగా రవిచంద్ర బాలకృష్ణ ఆశీస్సుల వల్లే అయ్యాడన్నారు. బాలయ్య చెప్పినట్లు చంద్రబాబు వెంట నడుస్తానని రవిచంద్ర చెప్పారు. వాస్తవానికి బీద బ్రదర్స్‌ను గుర్తించి ప్రోత్సహించి పదవుల్లో పెట్టింది చంద్రబాబు. అయితే వీరి బాలయ్య భజన ఏమిటోనని తెలుగుదేశం కార్యకర్తలు గుసగుసలాడడం విన్పించింది.

### మేకపాటిలో ఉత్సాహం

వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ కార్యకర్తల తొలి సమావేశం ఈ వారం నగరంలోని అత్యంత ఖరీదైన హోటల్‌లో ఘనంగా జరిగింది. తొలి సమావేశం కావడంతో పెద్ద సంఖ్యలో కార్యకర్తలు హాజరయ్యారు. వీరిని చూసి నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డిలో ఉత్సాహం వెల్లివిరిసింది. మనం కష్టపడితే 2014 అసెంబ్లీ ఎన్నికల్లో జిల్లాలోని పది సీట్లను సునాయాసంగా గెలుస్తాం. ప్రజలు మనవైపే వున్నారు. సేవాభావంతో ముందుకు సాగుదాం. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీలో వుండడమే గౌరవం. గ్రామస్థాయి నుంచి పార్టీని నిర్మించుకొందాం. మన ప్రత్యర్థులు మోసగాళ్లు. జాగ్రత్తగా వుండాలని ఆనం సోదరులను ఉద్దేశించి ఎమ్పీ వ్యాఖ్యానించడం ట్రంకు రోడ్డులో చర్చనీయాంశమయ్యింది.

### పిల్లలకు తప్పని తిప్పలు

నగరంలో జరిగే ఏ కార్యక్రమానికైనా ప్రకటించిన సమయానికి గాక రెండు మూడు గంటలు ఆలస్యంగా రావడం జంట ఎమ్మెల్యేలు వివేకానందరెడ్డి, శ్రీధర్‌కృష్ణారెడ్డి అలవాటులకు ఈ వారంలో సంతపేటలోని ప్రసన్నాంజనేయస్వామి దేవస్థానంలో హిందూ ధర్మ రక్షణ ట్రస్టు నేతృత్వంలో సామూహిక అక్షరాభాస్యం కార్యక్రమం ఏర్పాటు చేశారు. ముక్కుపచ్చలారని పసిపిల్లలు రెండు వందల మందికి పైగా విచ్చేసిన ఈ కార్యక్రమానికి జంట ఎమ్మెల్యేలు రెండు గంటలు ఆలస్యంగా హాజరవ్వడంతో పసిపిల్లలు, వారి తల్లి తండ్రులు అల్లాడి పోయారు. తనకు చదవబ్బ లేదని, అయ్యోర్లను బెదిరించి బీడీలు తాగే వాడినని చెప్పుకొనే వివేకానందరెడ్డి చేత పిల్లలకు అక్షరాభ్యాసం చేయించడమేమిటన్నది ట్రంకురోడ్ టాక్.


మేషం
అశ్వని, భరణి, కృత్తిక 1 పా

మాటలు జాగ్రత్తగా రానివ్వాలి. తగాదాల్లో విజయం మీదే. ఇష్టులైన వారి ద్వారా మీరు కోరుకొన్నవి సాధించుకొంటారు. సోదరులు సాయమందిస్తారు. నిలచి నిదానంగా ఆలోచించి పనులు నిర్వహించాలి. మిత్రుల తోడ్పాటు లభిస్తుంది. పొదుపు గురించి చింతిస్తారు. వృత్తిలో ముందంజ వేస్తారు. వ్యాపారులకు ప్రోత్సాహకరమైన వారం. రాజకీయులకు ప్రోత్సాహం తక్కువ.


వృషభం
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

మనశ్చింత. పనుల్లో ఆటంకం. పరిచితుల కోసం ధనం, కాలం వెచ్చించవలసి వస్తుంది. విశ్రాంతి తక్కువ. నష్టాల నెదుర్కొంటారు. అధికారుల నుండి సాయమందుతుంది. వృత్తి ఉద్యోగాల్లో పురోభివృద్ధి కానవస్తుంది. ధనాదాయం తృప్తికరం. ఆత్మీయులు మిక్కిలిగా ప్రోత్సాహమిస్తారు. సమాజంలో పరపతి పెరుగుతుంది. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.


మిథునం
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

కుటుంబసభ్యులతో అనుకూలంగా నడుచుకోవాలి. మనశ్చింత వుండవచ్చు. ఖర్చులు కూడ అధికం. కోరినవ్యక్తుల్ని కలుసుకొంటారు. ఆదాయం బాగుంటుంది. పథకాలు ప్రయోజనవంతమయ్యే దినం. సాధుసత్సంగమావకాశాలు. ఎదురుచూడని ధనాదాయ లాభం. సోదరులతో సత్సంబంధాలుంటాయి. రాజకీయులకు ప్రోత్సాహకరమైన కాలం. వృత్తిపరులకు కళాకారులకు మంచి ఆదరణ.


కర్కాటకం
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

దూరపు బంధువుల నుండి శుభవార్తాశ్రవణం. వాహనాల విషయంలో శ్రద్ధ చూపుతారు. వృత్తిలో నూతన వ్యక్తుల తోడ్పాటు వుంటుంది. పనులు చక్కగా పథకం ప్రకారం నిర్వహిస్తారు. ప్రియ వార్తాశ్రవణం. మిత్రుల వల్ల సాయమందుతుంది. కళత్రసుఖం చక్కగా వుంటుంది. ధనాదాయం బాగుంటుంది. రాజకీయులకు ఉత్తమ కాలం. వ్యాపారులకు మంచి లాభావకాశాలు విద్యార్థులకు శ్రమ.


సింహం
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

నూతనోత్సాహంతో పనులు జరుపుకపోతారు. విజయపరంపరలు. అధికారుల నుండి మేలు వార్త. వృత్తిలో ముందంజ వేస్తారు. భూభవనాలు కొనే ప్రయత్నాల్లు చేస్తారు. దైవచింతనలో మనసు పోనివ్వాలి. ప్రతిపని దీర్ఘంగా ఆలోచించి చేయాలి. నష్టావకాశాలు. అనవసరపు ఖర్చులు. ముందుచూపు అవసరం. ఉద్యోగులకు శ్రమాధికం. సరైన ప్రోత్సాహం ఉండదు. విద్యార్థులకు వృథా కాలక్షేపం.


కన్య
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్త 1, 2 పా

ప్రయాణాలలో సత్ఫలితాలు ఎదురుచూడవచ్చు. చిన్న చిన్న సమస్యలెదురవవచ్చు. ఉద్యోగ ప్రయత్నాల్లు ఫలిస్తాయి. విదేశీ ప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయమందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. కళాకారుల ప్రతిష్ట పెరుగుతుంది. దైవకార్యాల్లో చొరవ అధికంగా చూపుతారు. ఉద్యోగులకు శ్రమ అధికం.

# వారఫలాలు

*తేది 18-6-2011 నుండి 24-6-2011 వరకు మిథునంలో రవి, బుధులు; మేషంలో గురువు; వృషభంలో కుజ, శుక్ర, కేతువులు; వృశ్చికంలో రాహువు; కన్యలో శని; కన్య, తుల, వృశ్చిక, ధనుస్సుల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

19 తేది సంకష్టహర చతుర్థి.
22 తేది ఆర్ద్ర ప్రవేశం.

### శుభ ముహూర్తాలు

18, 24 తేదీల్లో కర్కాటక లగ్నాన ఉ.08.00 నుండి 10.00 గంటల వరకు. సింహ లగ్నాన ఉ.11.00 నుండి 1.00గంట వరకు. మకర లగ్నాన రా. 8.30 నుంచి 10.30 గంటల వరకు. కుంభ లగ్నాన రా.11.00 నుంచి 1.00 వరకు.

18, 20తేదీల్లో మేష లగ్నాన తె.2.00 నుండి 3.30 గంటల వరకు.

19, 20 తేదీల్లో సింహ లగ్నాన ఉ.11.00 నుండి 1.00గంట వరకు. మకర లగ్నాన రా. 8.30 నుంచి 10.30 గంటల వరకు. కుంభలగ్నాన రా.11.00 నుంచి 1.00 వరకు శుభ ముహూర్తాలున్నాయి.

**జూన్ తిథులు**
**జ్యేష్ఠ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 18 | శని | తదియ | రా 11.48 | గం.ల.వ |
| 19 | ఆది | చవితి | రా 12.06 | గం.ల.వ |
| 20 | సోమ | పంచమి | రా 12.21 | గం.ల.వ |
| 21 | మంగళ | షష్ఠి | రా 2.04 | గం.ల.వ |
| 22 | బుధ | సప్తమి | తె 3.46 | గం.ల.వ |
| 23 | గురు | అష్టమి | పూర్తిగా | |
| 24 | శుక్ర | అష్టమి | ఉ 5.48 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com


తుల
చిత్త 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

మోసపోయే అవకాశాలున్నాయి జాగ్రత్త. ఆరోగ్యవిషయాలు కూడా అంతంత మాత్రమే. శ్రమాధిక్యత. కోపావేశాలు తగ్గించుకోవాలి. రోగ నివృత్తి ద్వారా సుఖసంతోషాలు. ఉద్యోగంలో మార్పును గూర్చి ఆలోచిస్తారు. మంచి ఆప్తమిత్రులు చేయూత నిస్తారు. రావలసిన బాకీలు వసూలౌతాయి. ఉద్యోగులకు శ్రమ తగ్గుముఖం పడుతుంది. దైవకార్యాలలో పాలుపంచుకోవడం మంచిది.


వృశ్చికం
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

ఆత్మవిశ్వాసంతో పనులు జరుపుకొంటూ పోతారు. బంధుమిత్రుల సమాగమం. ఆనందం. ఒత్తిడి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. ఉత్సాహంగా గడుస్తుంది. శుభవార్తాశ్రవణం. మనశ్శాంతి చక్కగా వుంటుంది. శుభకార్యాల్లో పాల్గొంటారు. దూరాహ్వానాలు లాభాల్నిస్తాయి. భూసంపదను పెంచుకొనే యోచన చేస్తారు. రాజకీయులకు దురదృష్టకాలం. ఉద్యోగులకు గొడవలతో సాగుతుంది.


ధనుస్సు
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

సమస్యల్ని జాగ్రత్తగా అర్థంచేసుకొని మసలాలి. బంధుమిత్రుల తోటి విరోధభావం తొలగుతుంది. దైవకార్యాల్లో పాలుపంచుకొంటారు. శుభకార్యాచరణ. సత్సంగమం. దూరాలోచనతో స్థిర ధనాదాయాలకు ప్రణాళికలు సిద్ధం చేస్తారు. ముఖ్య నిర్ణయాలు తీసుకొంటారు. బంధుమిత్రులు సహాయ సహకారాలు అందిస్తారు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు.


మకరం
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

ఇతరులతో సంబంధాలు మెరుగ్గా వుంటాయి. సమాజంలో గౌరవ మర్యాదలు పెరుగుతాయి. మృదుభాషణతో పనులు సాధించుకొంటారు. సంతాన మూలంగా లాభాలు. శుభవార్తాశ్రవణం. అయినా విశ్రాంతి రాహిత్యం. రాజకీయులు తోటివారి విషయంలో జాగ్రత్తగా వుండాలి. పైవారిని విమర్శించకుండాలి. కళాకారులు, వృత్తిపరులు జాగ్రత్తగా మెలగాలి. ఉద్యోగులు అధికారుల ఒత్తిడికి గురౌతారు.


కుంభం
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

కుటుంబసభ్యులతో ఉంటూవచ్చిన స్పర్థలు తొలగుతాయి. వారసత్వపు గొడవలు ఒక కొలిక్కి వస్తాయి. ఒకవిధంగా శుభదినమనే చెప్పాలి. ఊహలు నిజమయ్యే రోజు. బంధుమిత్రవర్గంతో హాయిగా కాలక్షేపం చేస్తారు. సోదరులు మిత్రులు చక్కగా సాయమందిస్తారు. అనుకొన్నవి సాధిస్తారు. రాజకీయులకు అత్యంత అనుకూలమైన కాలం. వ్యాపార విస్తరణ చేస్తారు. విద్యార్థులకు మంచికాలం.


మీనం
పూర్వాభాద్ర 4 పా, ఉత్తరాభాద్ర, రేవతి

సోదరతుల్యుల నుండి ఆదాయం. సమాజంలో గౌరవమర్యాదలు పెరుగుతాయి. ప్రతి పని చాలా మెలకువగా చేస్తారు. వినోదాలతో కాలక్షేపమవుతుంది. నిరంతర పరిశ్రమతో పనులు నిర్వహిస్తారు. ఆర్థికలావాదేవీలు సత్ఫలితాల్నిస్తాయి. ఆదాయం తృప్తికరంగా వుంటుంది. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ఇంటిలో వివాహసంబంధ విషయాలు ప్రస్తావనకు వస్తాయి.

# విదిక్కులతో దుష్ప్రభావాలు!

*ఎం.సింహగిరి బెంగుళూరు*
*★ ఆగ్నేయం బ్లాకు స్థలం. గృహ నిర్మాణం చేశాక పడరాని పాట్లు పడుతున్నాను.*

బ్లాకు స్థలాలేవైనా విదిక్కుల దుష్ప్రభావాలుంటాయి. ఒకే వీధి గృహాలైతే సలక్షణంగా వుంటాయి. ఈశాన్యం బ్లాకు 'దిష్టివేధ'ను కలిగిస్తుంది. మీరు ఇంటికి ఉత్తరం వాకిలి తెరవండి. వాస్తు యంత్ర ప్రతిష్ట వల్ల ఫలితం వుంటుంది.

*ఇ.ఆర్.లక్ష్మీకోమలి చెన్నై*
*★ అమ్మాయి వివాహం ఆలస్యమవుతోంది!*

ఉత్తర, దక్షిణ దిశా వాస్తు దోషాలు ఉత్తరం ద్వారా తెలియజేశాను. వాటిని తక్షణం సరిచేసుకోండి. లక్ష్మీగణపతి యంత్రం, కుడిచేతి బుధాంగుళీయానికి 'పచ్చ' రత్నధారణ దోషాల్ని హరిస్తాయి.

*డాక్టర్ ప్రసేనగుప్త బెంగుళూరు*
*★ తలుపులు, కిటికీలు సరి సంఖ్యలో రావాలంటారు. ఉరువుకెదురు ఉరువు అంటారు.*

విశ్వంభర వాస్తు, పద్మసంహిత, వాస్తు సముచ్ఛయ గ్రంథాలు పై అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తున్నాయి. ఉరువు అంటే వస్తువు. కిటికీ కెదురుగా కిటికీయే రావాలని వాళ్లంటారు.

*కె.భాస్కరచౌదరి బెంగుళూరు*
*★ బి.పి, షుగర్ బాగా వున్నాయి. రంగుల్ని గురించి విన్నాను.*

వాస్తులో రంగుల ప్రభావాల్ని విశ్వామిత్ర వాస్తు వర్ణించింది. మీ గదిని నీలం, పచ్చ రంగుల్లో ఏదో ఒకదానితో నింపి, దక్షిణ ఆగ్నేయ, నైరుతుల్లో కిటికీలు ఏర్పాటు చేయండి. ఆరోగ్యవంతులవుతారు.

*సి.విజయసారథి నెల్లూరు*
*★ నైరుతి పెంట, ఆగ్నేయం వంట అనికదా సూత్రం?*

మీరు విన్నది కరెక్టే అయితే ఏ మూలలోనూ సెప్టిక్‌ట్యాంకు రావడానికి వీల్లేదు. ఆగ్నేయం వంటకు ప్రత్యామ్నాయంగా వాయువ్యం పెట్టుకోవచ్చు. శాస్త్రాలు ఒప్పుకుంటున్నాయి.

*ఎ.రంగాచార్యులు నెల్లూరు*
*★ ఆశ్రమ మూలస్థాపకుల పరిస్థితి చివరికి దయనీయమవుతోంది.*

వాస్తు, ఆగమ శాస్త్రాల నిర్లక్ష్యం, ధ్యానసిద్ధి, శక్తి ఆవాహన, ధ్యాన నిష్టలు, 'ఆత్మశక్తి'కి ప్రతీకలని తెలిసీ వాటిని పాటించక పోవడం, ఇలా ఎన్నైనా కారణాలు చెప్పవచ్చు.

*పళని సూర్యకాంతమ్మ చెన్నై*
*★ పూర్వజన్మ కర్మ సిద్ధాంత ప్రభావం ఎంత?*

వాస్తు లోపాలు, జ్యోతిష ఆటంకాలు సరిచేసుకున్న తర్వాత పూర్వజన్మ కర్మ సిద్ధాంతం గురించి ఆలోచించండి. మొదట నమ్మకం వుండాలి. శాస్త్రం తెలియకుండా విమర్శలు చేయడం మానుకోవాలి. నువ్వు చెయ్యవలసింది చేసి తర్వాత 'నమామి పరాత్పరం' అనుకోవాలి.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*పంట జగదీశ్‌రెడ్డి హైదరాబాద్*
*★ ఇంటి ప్లాను, వ్యూ ఫోటో పంపిస్తున్నాను చూడండి.*

దిక్కులు పెరగడం వల్ల ఈశాన్య, ఆగ్నేయ, వాయువ్య, నైరుతులు భ్రష్టమై ఆర్థిక, ఆరోగ్య, వివాద, వ్యాజ్య దుస్థితుల్ని, ఎగుడుదిగుళ్ల(ఇంట్లో) వల్ల ఆర్థికస్థితికి లోనుకావడం వల్లే మీరు ఇంటిని అమ్మి వేయడానికి గల కారణాలు.

*కంబాల హరిబాబు సికింద్రాబాద్*
*★ ఆడపిల్లల సమస్యలతో సతమతమవుతున్నాను. రాత్రి వింత శబ్దాలు వస్తున్నాయని నా భార్య చెబుతోంది.*

ఈశాన్యం అటాచ్డ్ లెట్రిన్ బాత్రూంను వెంటనే తీసివేయండి. ఉత్తరం నాలుగు అడుగుల నిర్మాణాలు తీసివేసి ప్రహరీ నిర్మించండి. నిమ్మ, కిచ్చిలి, పసుపు, కుంకుమ, వాగురాళ్ల (గుండ్రనివి) పసుపు వస్త్రంలో మూటగట్టి నైరుతి మూల తగిలించండి. ఫలితం వుంటుంది.

*డాక్టర్ భాస్కర పిళ్లై చెన్నై*
*★ వాస్తు గ్రంథ రచయితలు పద్దెనిమిది మంది అంటారే మరి సంఖ్య పాతికకు దాటుతున్నదే.*

మీరు పద్దెనిమిదో శతాబ్దం వరకూ గల గ్రంథాల్నే ప్రామాణికంగా తీసుకోవాలి. అప్పుడు సంఖ్య ఇరవై అయిదు అవుతుంది. భృగువు నుంచి అగస్త్యుడి వరకే ప్రాచీన వాస్తు శాస్త్రజ్ఞులు. మణిత్థుడు, బోధకులను మనం క్రీశ 12వ శతాబ్దానికి తర్వాతి వారుగా పరిగణించాలి.

• బదలీల

# కౌన్సిలింగ్‌తో సందడి!

"జిల్లాలోని అన్ని ప్రభుత్వ శాఖల్లో బదలీల కౌన్సిలింగ్ ఒకేసారి జరుగుతుండటంతో కార్యాలయాలలో పనులు స్తంభించిపోయాయి. కౌన్సిలింగ్‌లో పారదర్శకత లోపించడంతో గందరగోళాలు నిత్యకృత్యమయ్యాయి."



టీచర్ల కౌన్సిలింగ్‌లో రభస.

జిల్లాపరిషత్, మండలపరిషత్ ఎన్నికల నిర్వహణపై రాజకీయ పార్టీలు ఒకప్రక్క సన్నాహాలు చేస్తుండగా మరోప్రక్క రాష్ట్రప్రభుత్వం ఉద్యోగుల బదలీలకు అనుమతిచ్చింది. దీంతో అన్ని ప్రభుత్వశాఖల కార్యాలయాల్లో సందడి నెలకొంది. స్థానిక సంస్థల ఎన్నికలకు సంబంధించి నోటిఫికేషన్ ఎప్పుడైనా జారీ చేసే అవకాశం వుంది. ఇప్పటికే ఓటరు జాబితా, పోలింగ్ స్టేషన్ల జాబితాలను అధికారులు సిద్ధం చేశారు. పంచాయితీ, జిల్లా పరిషత్ అధికారులు ఈ ఎన్నికల నిర్వహణకు అవసరమైన ఏర్పాట్లలో పూర్తిగా నిమగ్నమై వున్నారు.

ప్రభుత్వ ఉద్యోగుల బదలీల కౌన్సిలింగ్ గత వారం రోజుల నుంచి జిల్లాలో జరుగుతున్నది. బదలీలు కోరుకొనే వారంతా విధులకు డుమ్మాకొడుతున్నారు. అన్ని శాఖలు ఒకే దఫా కౌన్సిలింగ్ చేపట్టడంతో ప్రభుత్వ సేవలు పూర్తిగా స్తంభించిపోయాయి. గ్రామీణ ప్రాంతాల నుంచి వివిధ పనుల నిమిత్తం ప్రభుత్వ కార్యాలయాలకు వెళ్తుంటారు. పనులు చేయాల్సిన సిబ్బంది బదలీల కౌన్సిలింగ్ వెళ్లారన్న సమాచారం అందడంతో వారు నిరాశతో వెనుతిరగక తప్పడం లేదు. అధికారులు, సిబ్బంది మధ్య కౌన్సిలింగ్‌పై వివాదాలు కూడా చోటు చేసుకొంటున్నాయి.

## వైద్యఆరోగ్యశాఖలో...

జిల్లా వైద్య ఆరోగ్యశాఖలో కౌన్సిలింగ్ సంబంధించి రోజుకో వివాదం చోటు చేసుకొంటుంది. ఈ శాఖలో పని చేస్తున్న సిబ్బందిని కేటగిరి వారీగా బదలీ చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఇందుకు యూనియన్ నేతలు అభ్యంతరం వ్యక్తం చేస్తున్నారు. మూడు సంవత్సరాలు ఒకే ప్రాంతంలో పని చేసిన వారిని బదలీ చేయాలన్న నిబంధన కూడా వుంది. అయితే కొందరు సిబ్బంది మూడు సంవత్సరాల నుంచి ఒకే ప్రాంతంలో వుంటూ బదలీకి దరఖాస్తు చేయలేదు. ఇటువంటి వారి జాబితాను అధికారులు ముందుగా రూపొందించలేకపోయారు. ప్రభుత్వం జారీచేసే మార్గదర్శకాలను పాటించకపోవడం వలన గందరగోళం ఏర్పడింది.

## ఎన్నికల కోలాహలం

జిల్లాపరిషత్, మండల పరిషత్‌లకు సంబంధించి రిజర్వుడ్, జనరల్ స్థానాలను ప్రకటించడంతో గ్రామీణ ప్రాంతాల్లో ఎన్నికల కోలాహలం నెలకొంది. ప్రధాన రాజకీయ పార్టీలన్నీ కూడా ఈ ఎన్నికలపై సభలు, సమావేశాలు నిర్వహించేందుకు సన్నాహాలు చేస్తున్నాయి. జిల్లాపరిషత్, మండల పరిషత్‌లు కైవసం చేసుకోవాలన్న లక్ష్యంతో గెలుపొందే అభ్యర్థుల గురించి ఆరా తీస్తున్నారు.

జిల్లావ్యాప్తంగా ఇదే అంశంపై చర్చించుకుంటున్నారు. అధికార యంత్రాంగం కూడా ఎన్నికల నిర్వహణకు సంబంధించి ముందస్తు ఏర్పాట్లు చేసుకొంటున్నది. ఓటరు జాబితాలో అవకతవకలు చోటు చేసుకున్నాయని వివిధ పార్టీల నేతలు ఫిర్యాదు చేయడంతో వాటిని సరిదిద్దుతున్నారు. ఉద్యోగులు బదలీల కౌన్సిలింగ్‌లో, రాజకీయ పార్టీల నేతలు ఎన్నికల కసరత్తుపై దృష్టి సారిస్తుండగా, సామాన్య రైతులు మాత్రం గిట్టుబాటు ధర, వరి విత్తనాలు, రసాయనిక ఎరువులు కొరతతో ఇక్కట్లు పడుతున్నారు. J

# రిజర్వు స్థలాలు ఎడాపెడా దురాక్రమణ!

**నెల్లూరు నగరంలో 150కి పైగా ప్రభుత్వ రిజర్వు స్థలాలను పలువురు రాజకీయ నేతలు, వారి అనుచరులు దురాక్రమించారు. వీరి నుంచి ఈ స్థలాలను స్వాధీనం చేసుకోవాల్సిన బాధ్యత కార్పొరేషన్, రెవిన్యూ అధికారులపై వుంది.**

నెల్లూరు నగరంలో రిజర్వు చేయబడిన స్థలాలు ఆక్రమణకు గురికాబడుతున్నాయి. మునిసిపల్ కార్పొరేషన్, రెవెన్యూశాఖలకు చెందిన ఖాళీ స్థలాలు నగరంలో అనేకం వున్నాయి. ఆయా ప్రాంతాల్లో లేఅవుట్లు ఏర్పాటు చేసే సమయంలోనే పార్కులకు రిజర్వు స్థలాన్ని కేటాయిస్తుంటారు. లేఅవుట్లలో ఇళ్ల నిర్మాణం జరిగిన తర్వాత ఖాళీగా వుంచిన స్థలాలను పలుకుబడి కలిగిన వ్యక్తులు ఆక్రమించి ఇతరులకు విక్రయాలు జరుపుతున్నారు. ప్రస్తుతం నగరంలో వున్న రిజర్వుడు స్థలాలపై కబ్జాదారుల కన్ను పడింది.

ఖాళీగా వున్న రిజర్వుడు స్థలాల్లో ఎవరైనా పేద ప్రజలు చిన్న పూరిపాక వేసుకుంటే ఆఘమేఘాల మీద వెళ్లి పూరిపాకను పీకేస్తుంటారు అధికారులు. అదే రాజకీయ పలుకుబడి కలిగిన వ్యక్తులు మొత్తం స్థలాన్ని ఆక్రమించి చదును చేసినా ఆ వైపు కన్నెత్తి కూడా చూడని సందర్భాలు వున్నాయి. ఇటీవల జిల్లా కలెక్టర్ అక్రమ లేఅవుట్లను గుర్తించి వెంటనే తొలగించాలని అధికారులను ఆదేశించిన సంగతి తెలిసిందే. కలెక్టర్ ఆదేశాలను అందుకున్న రెవెన్యూ యంత్రాంగం ఆ దిశగా చర్యలు చేపట్టేందుకు ముందుకు కదులుతోంది. అయితే నెల్లూరు నగరంలోని రిజర్వుడ్ స్థలాల గురించి మాత్రం కార్పొరేషన్, రెవెన్యూ అధికారులు పెద్దగా పట్టించుకోవడం లేదు.

అధికారికంగా నెల్లూరు నగరంలో దాదాపు 140కిపైగా రిజర్వుడ్ స్థలాలు వున్నట్లు అంచనా. గుర్తించలేని స్థలాలు మరో 50కిపైగా వున్నట్లు ప్రతిపక్షనేతలు చెబుతున్నారు. అధికారపార్టీకి చెందిన కొందరు మాజీ కార్పొరేటర్లు ఈ రిజర్వుడ్ స్థలాలను కబ్జా చేసి విక్రయాలు జరిపేందుకు రాజకీయ పైరవీలు చేస్తున్నారు. స్థానికంగా వుండే కొందరు అభ్యంతరం వ్యక్తం చేస్తున్నా వారిని ఏదో ఒకవిధంగా భయపెడుతున్నారు. పోలీసులను సంఘటనా స్థలానికి రప్పించి అడ్డుతగిలితే కేసులు నమోదు చేయిస్తామని బెదిరిస్తున్నారు.

ఇప్పటికే అనేక రిజర్వుడ్ స్థలాలు అదృశ్యమైపోయాయి. ప్రస్తుతం వున్న స్థలాలను కాపాడాలని నగర ప్రజలు కోరుతున్నారు. నగరంలో వున్న రిజర్వుడు స్థలాలు మార్కెట్ ధర ప్రకారం వెయ్యి కోట్ల రూపాయలు వుంటుందని తెలుగుదేశంపార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి ఇటీవల ప్రకటించారు. ఇన్ని కోట్ల రూపాయలు విలువైన స్థలాలను పరిరక్షించేందుకు మునిసిపల్ కార్పొరేషన్ అధికారులు ముందుకు రావడం లేదు. జివిఆర్ కళాశాల, గాంధీనగర్, చంద్రమౌళి నగర్ తదితర ప్రాంతాల్లో వున్న ఖాళీ స్థలాలను కబ్జా చేసేందుకు ఇటీవల కొందరు ప్రయత్నాలు చేశారు.

కబ్జా ప్రయత్నాలను స్థానికులు అడ్డుకోవడంతో వెనుకంజ వేశారు. నగరంలో ఖాళీస్థలాల దురాక్రమణపై చర్చ జరుగుతోంది. మునిసిపల్ కార్పొరేషన్‌కు పాలకవర్గం లేకపోవడంతో ప్రత్యేకాధికారిగా అదనపు జాయింట్ కలెక్టర్ బాధ్యతలు నిర్వహిస్తున్నారు. పేరుకే ప్రత్యేకాధికారి తప్ప ఆయన ఎప్పుడు కార్పొరేషన్ పరిపాలనపై దృష్టి సారించలేదు. ఈ నెలాఖరుకు పదవీ విరమణ చేస్తారు. ఆయన స్థానంలో ఐఏఎస్ అధికారిని నియమిస్తే కార్పొరేషన్ పరిపాలన కొంతమేర గాడిలోపడే అవకాశం వుంటుంది. J

# కలసి మెలసి వుంటా!



దర్శకుడు రాజమౌళి తీస్తున్న ఈగ చిత్రం షూటింగ్ గ్యాప్‌లో హీరోయిన్ సమంత పిచ్చాపాటీగా మాట్లాడింది. నెంబర్ గేమ్ అంటే ఏమిటో నాకు తెలీదు. ప్రతి రంగంలోనూ వున్నట్లే ఇక్కడా పోటీ అనేది వుంది. ఈ పోటీలో గెలవాలంటే ఎప్పటికప్పుడు మన ప్రతిభను నిరూపించుకోవాల్సిందే. పోటీ వుండదు అనే మాటలో వాస్తవం లేదు. అయితే ఇగోలకు దూరంగా వుంటేనే అందరితోనూ మంచి అనిపించుకోగలం. నా వరకు అయితే నా సహచర కథానాయికలందరితోనూ కలసి పోతానంటుంది సమంత.



# అసిన్‌పై కంగనా చిటపట!

బాలీవుడ్ హీరోయిన్ కంగనారనౌత్ మరో హీరోయిన్ అసిన్ పేరు చెబితేనే చిటపటలాడుతుంది. దీనికో కారణముంది. గత కొన్నాళ్లుగా కంగనా, హీరో సల్మాన్‌ఖాన్‌తో సన్నిహితంగా మెలుగుతోంది. సల్మాన్ ఎంత దూరంలో వున్నా షూటింగ్ స్పాట్ తెలుసుకొని మరీ సెట్‌కి వెళ్లి పలకరించి రావడం ఆమె దినచర్య. సల్మాన్ కూడా ముంబాయిలో వుంటే ఇదే పనిలో వుంటాడట. కాని కంగనా, సల్మాన్‌ల మధ్య విభేదాలు పొడజూపాయి. దీనికి కారణం సల్మాన్‌తో రెడీ సినిమాలో కలసి నటించిన అసినే అంటుంది కంగనా. అప్పటి నుంచి అసిన్‌ను ఆమె నోటికొచ్చినట్లు తిడుతుండగా, తానీ విషయాన్ని పట్టించుకోనంటుంది అసిన్. వంద మంది మగాళ్లకు సర్ది చెప్పొచ్చు. ఇద్దరమ్మాయిలను కలపగలమా?

# డబ్బు ముఖ్యమండీ!



డబ్బే లోకం అనుకోవడం పొరపాటు కానీ... డబ్బుకున్న విలువ తెలుసుకోవడం, దాన్ని సంపాదించడానికి కష్టపడడం తప్పు కాదంటుంది హీరోయిన్ ప్రియమణి. ప్రతి సినిమాని పేరు సంపాదించడానికో, అవార్డు తెచ్చుకోవడానికో చేయకూడదు. డబ్బులు కూడా సంపాదించుకోవాలి కదా? అందుకే అప్పుడప్పుడు ఈ ధోరణిలో ఆలోచించి బోల్డ్‌గా నటించే సినిమాలు ఒప్పుకొంటుంటాను. అయినా నాకు తెలియక అడుగుతాను నాకు డబ్బు వద్దు, కేవలం పేరొక్కటే సరిపోతుందని అనుకొనేవారు ఎంతమంది వున్నారని ఎదురు ప్రశ్నిస్తోంది ప్రియమణి.

# ప్రేయసిని మార్చిన జాన్‌అబ్రహాం!



హీరోయిన్ బిపాసా బసుతో ప్రేమ పెటాకులయ్యాక హీరో జాన్ అబ్రహం కొత్త జోడీ వేటలో పడ్డాడు. ఇంతలో అతన్ని హీరోయిన్ చిత్రాంగద ఆకర్షించింది. దేశిబాయ్స్ చిత్రం షూటింగ్‌లో వీరిద్దరూ బాగా దగ్గరయ్యారు. నిత్యం కబుర్లతో సరదాగా గడపటం వంటి పనులన్నీ చేస్తున్నారు. చిత్రమేమిటంటే చిత్రాంగదకు ఇప్పటికే పెళ్లి నిశ్చయమైంది. ఇంతలో ఈ కొత్త స్నేహానికి సంబంధించిన వార్త బయటకు వచ్చింది. దీంతో చిత్రాంగదకు కాబోయే భర్త జ్యోతిరాంధ్వా నొచ్చుకొంటున్నాడట. అయితే చిత్రాంగద మాత్రం తమ మధ్య చక్కని స్నేహం మాత్రమే వుందని, అయితే ఎవరి హద్దుల్లో వాళ్లున్నామంటుంది. అంతకు మించి తమ మధ్య మరేమీ లేదంటుంది. నమ్ముదామా?

# జయాపజయాలు మన చేతుల్లో లేవు



తెలుగు తెరపైకి వచ్చిన తొలినాళ్లలో ఛార్మి అంటే కేవలం అందం మాత్రమే గుర్తుచ్చేది. ఘాటైన అందాల ఆరబోత ప్రేక్షకుల మదిలో మెదిలేది. ఆ తర్వాత ఛార్మి తన పంధా మార్చుకొంది. కథానాయికకు ప్రాధాన్యమున్న చిత్రాల్లో నటించేందుకు ఆసక్తి చూపింది. ఆరంభంలో ఒకట్రెండు సినిమాలు మంచి ఫలితాన్నిచ్చినా ఆ తర్వాత మాత్రం వ్యవహారం బెడిసి కొట్టింది. దీంతో ఆమె తనకు తెలిసిన గ్లామర్ వైపే మొగ్గు చూపింది. అయినా ప్రయోజనం కనిపించడం లేదు. ఈ విషయమై షూటింగ్ గ్యాప్‌లో వున్న ఆమెను కథానాయికకు ప్రాధాన్యమున్న చిత్రాలతోనే మీలో గ్లామర్ కోణం దెబ్బ తినిందా అంటే కానే కాదంది. ఈ తరహా అంచనా సరైంది కాదు. చిత్రాల్లో ఆయా పాత్రలకు అనుగుణంగా నటిస్తాం. జయాపజయాలు మాత్రం మన చేతుల్లో వుండవు. కొన్నిసార్లు తప్పొప్పులు జరుగుతుంటాయి వాటిని సరిదిద్దుకుంటూ వెళ్లాలంతే అంది.

# బద్రినాథ్ - బాగున్నాడు!



✍ అల్లూరు రహీం

యాక్షన్ కథలకు కొత్త రంగులద్దిన దర్శకుడు వివి వినాయక్. ఆయన సినిమాలంటే గాల్లో పల్టీలు కొట్టే సుమోలు, తొడగొట్టే కథానాయకుడు, పౌరుషం, ప్రతీకారాలు మామూలు. దీనికి గతంలో ఆయన తీసిన ఆది, ఠాగూర్, లక్ష్మి, కృష్ణ, అదుర్స్ చిత్రాలు ఉదాహరణ. ఈ చిత్రాలకంటే భిన్నంగా అల్లు అర్జున్‌లోని పూర్తిస్థాయి శక్తి సామర్థ్యాలను చూపెడుతూ తీసిన చిత్రమే బద్రినాథ్. ఒకరకంగా చెప్పాలంటే నవరసాలు పూర్తిగా కుదిరిన చిత్రం బద్రినాథ్. కథకుడు చిన్నికృష్ణ ఈ చిత్రాన్ని పుణ్యక్షేత్రం బద్రినాథ్ బ్యాక్‌డ్రాప్‌గా అల్లిన కథను దర్శకుడు తెరపై అద్భుతంగా చూపడం అన్ని వర్గాలను అలరిస్తుంది. సంభ్రమాశ్చర్యాలకు గురిచేసే సెట్టింగులు, పోరాటాలు, పాటలు, హీరోయిన్ అందాల ప్రదర్శన, మాటలు బద్రినాథ్‌లో పొందికగా కుదిరాయి. అందువల్లే మూడుగంటల పాటు సాగే చిత్రాన్ని ప్రేక్షకులు విసుగు లేకుండా చూసేస్తారు. ప్రపంచానికి ఆధ్యాత్మిక జ్ఞానం నేర్పిన దేశంగా భారతదేశాన్ని చూపెడుతూ హిందూ మతానికి చెందిన ఎన్నో దేవాలయాలను పరమత పాలకులు ధ్వంసం చేశారని చెబుతూ చూపించిన సన్నివేశాలు రోమాలు నిక్కబొడుచుకొనేలా చేస్తాయి. ఇటీవల జరిగిన అక్షరధామ్ ధ్వంసం, హిమాలయాల్లోని తక్షశిల పీఠం, గంగానది ప్రవాహం, బ్రహ్మకమలాలు, మంచుతో పేరుకొన్న పర్వతశ్రేణులు, క్షేత్రపాలకులు, బ్రదినాథ్ సెట్టింగ్‌లను కళాదర్శకుడు ఆనందసాయి అద్భుతంగా రూపొందించాడు. కొన్ని యదార్థప్రదేశాల్లో చిత్రీకరణను కూడా కెమెరామెన్ రవి అత్యద్భుతంగా చేశాడు. పీటర్ హెయిన్స్ చేయించిన పోరాటాలు, రాజుసుందరం హీరో అల్లుఅర్జున్ చేత చేయించిన క్రొంగొత్త నృత్యాలు, సిక్స్‌ప్యాక్ బాడీ ప్రదర్శన బాగుంది. నెల్లూరీయుడు రాజేంద్రకుమార్ వ్రాసిన మాటల్లో శవాన్ని అన్ని మతాల్లో పూజిస్తారు. మన మతంలో నీచంగా చూస్తారు. ప్రపంచంలో అతి శక్తివంతమైనది ప్రేమ. అల్లా అయినా, ఆది శంకరుడైనా... జీసస్ అయినా మనిషి రూపంలో వస్తాడు అని ఒక డైలాగ్ వ్రాశాడాయన. కాని అల్లా మనిషి రూపంలో పొరపాటున కూడా రాడని ముస్లింల పవిత్ర గ్రంథం 'ఖురాన్'లో పేర్కొన్న విషయం ఈ మాటల రచయితకు తెలిసినట్లులేదు. ఈ చిత్రంలో ఆరుపాటలు బాగా కుదిరాయి. అయితే మరీ బాగున్నపాటలంటే నచ్చావురా, అదిరి చెదిరి, నాథ్...నాథ్‌ను చెప్పుకోవాలి. జుమ్‌తార చరణంతో సాగేపాట ఈ మధ్య హిట్ అయిన కత్రినాకైఫ్ షీలాకి జవానీ పాటకు మక్కీమక్కీ కాపీ కొట్టాడు పెద్ద సంగీత దర్శకుడు కీరవాణి. అన్ని పాటల్లో అందమైన తమన్నాను చూడను రెండుకళ్లు చాలవు.

ఇక కథలోనికి వెళ్తే హిందూ ధర్మక్షేత్రాల విధ్వంసాలను ఆపను క్షేత్రపాలకులను నియమించాలని మత పెద్దలు నిర్ణయిస్తారు. దీనికి అవసరమైన క్షేత్ర పాలకులను తయారు చేయమని హిమాలయాల్లో వుండే శక్తివంతుడైన మత గురువు భీష్మ నారాయణ్(ప్రకాష్‌రాజ్)ను కోరుతారు. ఆయన శిష్యపరంపరలోని మెరిక బద్రినాథ్ (అల్లు అర్జున్). పుణ్యక్షేత్రం బద్రినాథ్‌కు తన తాతయ్యతో చూడను వచ్చిన అలకనంద(తమన్నా) హీరోకు తారసపడుతుంది. దైవద్వేషి అయిన ఆమె బద్రినాథ్ సన్నిధిలో హారతి ఆపడంతో కోపం తారాస్థాయికి చేరిన భీష్మ నారాయణ్ ఆమెను గంగలో త్రోయమంటాడు. అదే పని బద్రినాథ్ చేస్తాడు. చివర ఆమె తాతయ్య అలకనంద దైవద్వేషిగా మారడానికి ఆమె తల్లి దండ్రులు సుధ, సాయాజిషిండే దైవ




సన్నిధిలో చనిపోవడమని చెప్పేసరికి రక్షిస్తాడు. కాని అలక నందను మేనత్త తన కొడుకు నానీకిచ్చి పెళ్లి చేయాలని ఆమె భర్త మాఫియా నేత సర్దార్ (కెల్లీడోర్జి)ని కోరుతుంది. వారి నుంచి రక్షించనే అలకనందను బద్రినాథ్ తీసుకవెళ్తాడు తాతయ్య. అమర్‌నాథ్‌క్షేత్రాన్ని టెర్రరిస్టుల దాడి నుంచి బద్రినాథ్ రక్షిస్తాడు. అలకనంద మనసు నిండా బద్రినాథ్ నిండుతాడు. అతని ప్రేమ లోపడి ఆమె దైవభక్తురాలిగా మారుతుంది. బద్రినాథ్ సలహాపై బ్రహ్మకమలాలను హిమాలయ పర్వత శ్రేణుల నుంచి తెచ్చి గుడిలో వుంచి మనసులో వున్న కోరిక కోరుకుంటుంది. కాని గురువు భీష్మ నారాయణ్ తక్షశిలకు వారసుడు చేయాలనుకొన్న బద్రినాథ్‌ను అలకనంద ఎగురవేసుకొని పోవాలని చూడడాన్ని భరించలేదు. గురువు మాట మీద బద్రినాథ్ నిలబడ్డాడా.. ప్రేయసి వైపు వొరిగాడా అన్నది వెండితెరపై చూడడం మంచిదేమో.

# వైద్యం వికటించి బాలింత మృతి!

● డాక్టర్‌కు అండగా పోలీసులను పంపిన వివేకా

ప్రధాన వైద్యురాలు లేకున్నా ఆస్పత్రిలో చేర్చుకొని బాలింతరాలిని పొట్టన పెట్టుకొన్న ఘటన నెల్లూరు సండే మార్కెట్ వద్ద గల విజయలక్ష్మి హాస్పిటల్‌లో చోటుచేసుకొంది. విడవలూరు మండలం రామతీర్థం గ్రామానికి చెందిన ముప్పల అరుణకు, నవాబుపేటకు చెందిన శ్రీమన్నారాయణతో వివాహం అయ్యింది. నెలలు నిండి నొప్పులు రావడంతో హాస్పిటల్‌లో 11వ తేది చేర్చారు. పాపకు జన్మనిచ్చినట్లు చెప్పిన సిబ్బంది కొంతసేపటికే తల్లి పరిస్థితి ఆందోళనకరంగా వుందని వేరే వైద్యశాలకు తీసుకెళ్లాలని చెప్పారు. డాక్టర్‌ని కలిసి మాట్లాడతామని కోరినా ఆమె బంధువులకు నిరాశ ఎదురయ్యింది. చివరకు అంబులెన్సులో మరో ఆస్పత్రికి తీసుకెళ్లగా అప్పటికే ఆమె చనిపోయిందని చెప్పడంతో వారు కన్నీటి పర్యంతం అయ్యారు. మొదట చేర్చిన హాస్పిటల్‌కు చేరుకొని డాక్టర్ల నిర్లక్ష్యం వల్లే మరణించిందని ఆందోళనకు దిగారు. ఆ సమయంలో హాస్పిటల్ నిర్వాహకురాలు రూరల్ ఎమ్మెల్యేకు ఫోన్ చేయడంతో ఆయన హుటాహుటిన తన పిఏను అక్కడకు పంపడంతోపాటు పోలీసులను మృతురాలి బంధువులపైకి పంపాడు. వారు వచ్చి బాధితులకు న్యాయం చేయాల్సిందిపోయి బెదిరింపులకు దిగడంతో వారు అరుణ మృతదేహాన్ని తీసుకొనిపోయేందుకు సిద్ధం అయ్యారు. ఈ సంగతి తెలుసుకొని కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి అక్కడకు చేరుకొని పోలీసుల తీరును తప్పుపట్టారు. వైద్యుల నిర్లక్ష్యం వల్లనే అరుణ మృతి చెందిందని చెప్పిన ఆయన ఈ విషయంలో రాజకీయం చేస్తే సహించేదిలేదని గట్టిగా మాట్లాడడంతో ఎట్టకేలకు దిగివచ్చిన హాస్పిటల్ నిర్వాహకురాలు కొంత పరిహారం అందజేస్తానని ఒప్పందం కుదుర్చుకొని సమస్యను పరిష్కరించుకొన్నారు.


హాస్పిటల్ వద్ద బాలింత శవంతో బంధువుల ఆందోళన.


కలువాయి సాగునీటి సంఘం అధ్యక్షుడు మాకిరెడ్డి వెంకట కృష్ణారెడ్డి కుమార్తె సాయి ప్రియాంక – అశోక్‌కుమార్‌రెడ్డిల వివాహం 12వ తేది నెల్లూరు స్వర్ణవేదిక కళ్యాణ మండపంలో జరిగింది.

## జైలు కమిటీలో అవగాహనలేని సభ్యులు!

### కలెక్టర్‌ను బురిడి కొట్టించిన జైలు అధికారులు

జిల్లా జైలు కమిటీలో అవగాహనలేని వారిని సభ్యులుగా నియమించడం జరిగింది. ఇటీవల జిల్లా కలెక్టర్ బి.శ్రీధర్ జైలును సందర్శించిన సందర్భంగా సంక్షేమ కమిటీని ఏర్పాటు చేయడం జరిగింది. జిల్లా జైలు స్థితిగతులు, ఖైదీలు ఎదుర్కొంటున్న సమస్యల పట్ల ఎంతో కొంత అవగాహన కలిగి వున్న వారికి ప్రాధాన్యతనిచ్చి కమిటీలో నియమించాల్సి వుంటుంది. ప్రస్తుతం కమిటీలోకి తీసుకున్న ఏ ఒక్కరు కూడా కనీస అవగాహన లేనివారే. జైలు నిబంధనల ప్రకారం ఒక వైద్యుడు, స్వచ్ఛంద సంస్థ ప్రతినిధి, సంఘ సేవకుడు, మానవ హక్కుల సంఘం నుంచి ఒకరు, లాయర్‌ను నియమించాలి. అయితే జైలు అధికారులు తమకు ఇష్టమైన వారి పేర్లను ప్రతిపాదించి కలెక్టర్ చేత ఆమోదింపచేయించుకొన్నారు. కలెక్టర్ జిల్లాకు కొత్త కావడంతో కమిటీలో నియమించిన సభ్యుల గురించి ఎవరు కూడా పూర్తి సమాచారం అందించలేదు. చివరకు జైలు అధికారులు సైతం కలెక్టర్‌ను బోల్తా కొట్టించారు. జైలు సంక్షేమ కమిటీ పదవీకాలం ఐదు సంవత్సరాలు వుంటుంది. నూతన కమిటీలోకి తీసుకున్న ఆరుగురు సభ్యులు కూడా ఏనాడూ జిల్లా జైలును సందర్శించిన సందర్భాల్లేవు. ప్రతివారం కమిటీ జైలును సందర్శించి ఖైదీలెదుర్కొంటున్న సమస్యలు తెలుసుకొని, సమీక్ష చేయాల్సి వుంటుంది. వీరికి అనుభవం లేకపోవడం వల్ల సమస్యలు ఉత్పన్నం కావచ్చు.

## అవినీతిమయమైన కాంగ్రెస్!

కాంగ్రెస్ పార్టీ జాతీయ అవినీతి పార్టీగా మారిపోయిందని బిజెపి మాజీ జాతీయ అధ్యక్షుడు బంగారు లక్ష్మణ్ వ్యాఖ్యానించారు. 12వ తేది నెల్లూరు వచ్చిన ఆయన పార్టీ కార్యాలయంలో విలేకరులతో మాట్లాడారు. రెండు సార్లు యుపిఏను ప్రజలు గెలిపిస్తే ప్రభుత్వ నిధులను రకరకాల స్కాంల పేరిట దోపిడీకి పాల్పడ్డారు. వీరి వల్ల ప్రపంచంలోనే అవినీతిమయ దేశంగా భారతదేశం నిలచిందన్నారు. ప్రాంతీయ పార్టీలను, ఉప ప్రాంతీయ పార్టీలను విమర్శించిన కేంద్ర మంత్రి జైపాల్‌రెడ్డి ఆ పార్టీల మద్దతు లేకుండా ఏ రాష్ట్రంలో కాంగ్రెస్ అధికారంలో వుందో చెప్పాలన్నారు. ప్రజలు కట్టబెట్టిన అధికారాన్ని దుర్వినియోగం చేయడంలో కాంగ్రెస్ పార్టీ రికార్డు సృష్టించింది. యుపిఏ ఏడేళ్ల పాలనలో అవినీతి తప్ప అభివృద్ధి అనే మాట వినిపించడంలేదన్నారు. యుపిఏ ప్రభుత్వంలోని ప్రజాప్రతినిధులంతా జైలుకు వెళ్తున్నా ఇంకా ఆ పార్టీ గొప్పలు చెప్పుకోవడం హాస్యాస్పదమన్నారు. అవినీతి చెదపుట్టైన కాంగ్రెస్ పార్టీ త్వరలో తెరమరుగుకానుందన్నారు. అవినీతికి వ్యతిరేకంగా ఎవరు ఉద్యమించినా బిజెపి, ఆర్‌ఎస్‌ఎస్ మద్దతు ఇస్తాయన్నారు. ఈ సమావేశంలో బిజెపి జిల్లా అధ్యక్షుడు కర్నాటి ఆంజనేయరెడ్డి, కార్యదర్శి మిడతల రమేష్ పాల్గొన్నారు.

## ఎవరిగోల వారిదే!

స్థానిక సంస్థల ఎన్నికలకు సంబంధించి ఎస్సీ, ఎస్టీ, బిసి, మహిళ, జనరల్ స్థానాల రిజర్వేషన్‌లను ప్రభుత్వం విడుదల చేసింది. ఈ వివరాలు వెల్లడైన నాటి నుంచి రాజకీయ పార్టీల్లో ఎన్నికల వ్యూహాలు ఊపందుకొన్నాయి. ఇప్పటి నుంచే ఎవరికి వారు ఆయా ప్రాంతాల్లో సామాజిక పరిస్థితులు, వర్గాలు లెక్కల్లో మునిగిపోయి వున్నారు. రానున్న ఎన్నికల్లో పోటీచేయదలచుకొన్న ఔత్సాహిక అభ్యర్థులు ఇప్పటి నుంచే తమవంతు ప్రయత్నాలను ముమ్మరం చేయడంతోపాటు ఓటర్లను కలుసుకొనేందుకు రకరకాల కార్యక్రమాలతో వెళ్తున్నారు. మరోవైపు ప్రధాన ప్రతిపక్షమైన తెలుగుదేశం, బిజెపి, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వ విధానాలపై ఏమాత్రం అవకాశం వున్నా ధర్నాలు, ఆందోళనలు చేపడుతూ కార్యకర్తల్లో ఉత్సాహం నిపడంతోపాటు ప్రజలకు చేరువయ్యేందుకు ప్రయత్నిస్తున్నారు. అవినీతి, పెరిగిన ధరలు, రైతు సమస్యలు ఇలా ప్రతి అంశాన్ని వదలకుండా ప్రజా సమస్యలపై తమ వాణిని, తమ ఉనికిని చాటుతున్నాయి. ఇక తీరప్రాంత మండలాల్లో ఏర్పాటవుతున్న ధర్మల్ విద్యుత్ ప్రాజెక్టులకు వ్యతిరేకంగా టిడిపి, బిజెపి, కమ్యూనిస్టు పార్టీలు కలసి కట్టుగా తమ పోరాటాన్ని ఉధృతం చేసిన సంగతి తెలిసిందే. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ రైతు సమస్యలపై కలక్టరేట్ ముట్టడి చేపట్టింది. ఎవరికి వారు స్థానిక సంస్థల ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని ఇప్పటి నుంచే తమ వ్యూహాలను రచిస్తూ, ప్రజలను ఆకట్టుకొనే పనిలో పడ్డారు.

## పట్టా స్థలాల్లోనే దురాక్రమణలు!

నెల్లూరు నగరంలో ఆదమరిస్తే పట్టా స్థలాలను సైతం దురాక్రమించేస్తున్నారు. ఈ దురాక్రమణ దారులపై తగిన చర్యలు తీసుకోమని జిల్లా కలెక్టర్ ఆదేశించినా మండల రెవిన్యూ అధికారులు పట్టించుకోవడం లేదు. కోవూరుకు చెందిన ఎస్.ఎం. బాష నెల్లూరు బిట్–1 పరిధిలోని ఎన్‌సిసి కాలనీలో తిక్కవరపు శివకుమార్‌రెడ్డి వేసిన లేఅవుట్‌లో 38 అంకణాల స్థలాన్ని కొనుగోలు చేశారు. ఈ స్థలాన్ని నాలుగు దిక్కుల్లో తలాకొంత దురాక్రమణదారులు ఆక్రమించారు. స్థల యజమాని తన ఒరిజినల్ డాక్యుమెంట్లు నెల్లూరు ఎమ్మార్వో కార్యాలయంలో పొందుపరచి ఫీజుకట్టి హద్దులు చూపించమని కోరారు. మార్చి నెల ప్రభుత్వ సర్వేయర్ బాష స్థలంలో హద్దులు ఏర్పాటు చేశారు. అయినా దురాక్రమణదారులు ఈ హద్దురాళ్లు పీకేశారు. హద్దురాళ్లు తీసివేయడం క్రిమినల్ నేరం. ఈ విషయమై బాష ఐదవ పట్టణ పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదుచేసినా చర్యలు లేవు. ఏప్రెల్ నెలలో ఈ విషయమై బాష జిల్లా కలెక్టర్‌ను కలిసి ఫిర్యాదుచేస్తే ఆయన దురాక్రమణదారులపై చర్యలు తీసుకోమని ఎమ్మార్వోకు నోట్ వ్రాసిచ్చినా చర్యలు లేవని వాపోతున్నాడు.

# జారుకొంటున్న జగన్ ఎమ్మెల్యేలు

కడప ఉప ఎన్నికల తర్వాత కాంగ్రెస్ ఎమ్మెల్యేలందరూ ఒకరికి తెలియకుండా మరొకరిగా జగన్ గూటికి చేరుకొంటారన్న పరిశీలకుల అంచనా తప్పుతున్నది. ఆ ఎన్నికల ఫలితం కాంగ్రెస్‌వాదులను ఎంతగా గాబరా పెట్టిందీ తెలిసిన సంగతే. ఈ ఎన్నిక తర్వాత కాంగ్రెస్‌కు గెలుపు గుర్రం దొరకదన్న అభిప్రాయం అందరిలో ఏర్పడిపోయింది. కానీ విచిత్రంగా రోజులు గడిచే కొద్దీ జగన్ వద్ద కొత్తగా ఎమ్మెల్యేలు చేరడం కాదు, వున్నవారు జారుకొంటున్నారు. విచిత్రమైన పరిణామం అది. దానికి కారణం జగన్ అనుసరిస్తున్న రాజకీయ పోకడ కావడం గమనార్హం. జగన్ శైలి ఆయన అనుచరులకు నచ్చడం లేదు.

తన భవిష్యత్ వ్యూహం ఏమిటో చూచాయగా కూడా తన ఎమ్మెల్యేలతో చర్చించడం లేదు జగన్. మొన్నటి శాసనసభ సమావేశాల సమయంలో ఆయన వద్ద 40 మంది ఎమ్మెల్యేలవరకు చేరారు. వీరిలో అత్యధికులు ఏ పరిణామాలకైనా సిద్ధపడి వచ్చినవారే. రాజీనామాలకు కూడా వీరు రెడీ. కానీ జగన్ మాత్రం ఉప ఎన్నికలు వద్దు అం టున్నాడు.

బొత్సా పిసిసి పదవిలోకి వచ్చిన తర్వాత జగన్ వర్గ ఎమ్మెల్యేల మీద ఒత్తిడి పెరిగిపోయింది. నియోజకవర్గాలలో వారి పనులు చేయకూడదని అధికారులకు ఆదేశాలు వస్తున్నాయి. మంత్రులైతే దగ్గరకు రానివ్వడం లేదు. దానితో కార్యకర్తలలో అప్పుడే అసంతృప్తి కన్పడుతున్నది. మరొకప్రక్క జగన్ వర్గానికి చెందిన ఒక అరడజను మంది ఎమ్మెల్యేలను అనర్హులుగా ప్రకటించే ప్రక్రియకు స్పీకర్ శ్రీకారం చుట్టాడు. ఏ క్షణంలోనైనా ఆ నిర్ణయం వెలువడ వచ్చు. ఇది ఆ వర్గంలో కలవరం సృష్టిస్తున్నది. ప్రభుత్వం తమను అనర్హులుగా ప్రకటించే ముందే తాము రాజీనామా చేస్తే గౌరవం కదా అన్నది వీరి వాదన. జగన్ ఎందుకు నిలువరిస్తున్నాడో వీరికి అర్థం కావడం లేదు.

ఈ అనిశ్చిత స్థితి వల్ల జగన్ శిబిరం నుంచి ఒకరొకరుగా ఎమ్మెల్యేలు మళ్లీ కాంగ్రెస్ గూటికి చేరుకొంటున్నారు. రోజు రోజుకూ జగన్ సంఖ్య తరిగి పోతున్నది. కానీ జగన్ మాత్రం నిశితంగా వున్నాడు. ఆయన మనసులో ఏ ఆలోచన వుందో ఎవరికీ తెలియదు. బయటకు చెప్పడం లేదు. మరొకప్రక్క జగన్ వద్ద కనీసపాటి మర్యాద కూడా లభించడం లేదన్న ఆవేదన ఆ శిబిరంలో కన్పిస్తున్నది. అంబటి రాంబాబు, కొండా సురేఖ వంటి వీర విధేయులలో సైతం ఈ అంసతృప్తి వుందంటే, జగన్ వ్యవహార శైలి ఏ తీరులో వుందో అర్థం చేసుకోవచ్చు.

## ఉప్పునిప్పుగా

9వ పేజీ కొరవ

సత్సంబంధాలు లేవన్న నిజం బయటపడిపోయింది. జిల్లా రాజకీయాలలో అది ఆనం సోదరులకు కొంత ఇబ్బందికర పరిణామం. ఇప్పటికే జిల్లా కలెక్టర్, ఎస్పీలను మంత్రితో నిమిత్తం లేకుండా నేరుగా ముఖ్యమంత్రి ఎంపిక చేశాడన్న ప్రచారం వుంది. దానికి ఇది అదనం. ముప్పై ఏళ్ల నేదురుమల్లి జనార్ధనరెడ్డి పెత్తనాన్ని తాము పెరుక్కొని, జిల్లా నేతలుగా వెలుగొందాలని ఆశ పడుతున్న ఆనం సోదరులు ఈ సంఘటనలను జీర్ణించుకోలేక పోతున్నారు.

### పదవులకు ప్రమాదం

ముఖ్యమంత్రి దగ్గర తమ మాటకు విలువ లేదని అందరికీ అర్థమైతే చాలా సంకటాలొస్తాయి. వాటిలో మొదటిది – పదవులలో తమ ఎంపిక. నెల్లూరు రీజియన్ ఆర్టీసి ఛైర్మన్‌గా మాజీ మేయర్ భానుశ్రీ, జిల్లా గ్రంథాలయ సంస్థ అధ్యక్షుడిగా గుండె మడకల ఓబులరెడ్డి, జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా రాచాల రవికుమార్ యాదవ్‌లను నియమించాలని గత ఐదు నెలలుగా ముఖ్యమంత్రిని కోరుతున్నారు వారు. ఆ పదవులన్నీ తమ ఖాతాలోకే వస్తే, పార్టీలో తమ ఆధిపత్యానికి తిరుగు వుండదని భావిస్తున్నారు. ఇప్పుడు ముఖ్యమంత్రి ముఖం చూడలేని పరిస్థితి వస్తే, ఈ పదవులన్నీ ప్రమాదంలో పడతాయి. రెండవ నష్టం అధికారుల మీద కర్ర పెత్తనం. నెల్లూరు మునిసిపల్ కమిషనర్, ఎమ్మార్వో, పోలీసు ఎస్‌ఐలను తమ అదుపులో పెట్టుకొని, గత కొన్నేళ్లు నగరాన్ని ఏలుతున్నారు వారు. తమ మాట వినని వాడు నగరంలో చిన్న ఇల్లు కూడా కట్టుకోలేని నియంతృత్వాన్ని పాటిస్తున్నారు. కట్టిన ఇళ్లను కూడా కూలగొట్టి అధికార దర్పం ప్రదర్శిస్తున్నారు. కట్టే ప్రతి అపార్టుమెంట్లో పెంట్ హౌస్, వేసే ప్రతి లే అవుట్‌లో పదవ వంతు భాగం నిలబెట్టి దోచుకొంటున్నారు. ఇప్పుడా దుర్మార్గాలకు, దోపిడీలకు ఆటంకాలు ఎదురౌతాయి.

### అసలుకే మోసమా?

ఈ నెలాఖరులో మంత్రిత్వ విస్తరణ జరపాలన్నది ముఖ్యమంత్రి ఆలోచన అని చెప్తున్నారు. ఆ విస్తరణలో కనీసం నలుగురు రెడ్డి కులస్తులకు ఉద్వాసన ఖాయమని ప్రచారం వుంది. ఆ నలుగురిలో రామనారాయణరెడ్డి ఒకడుగా వుంటాడా అన్నది ఇప్పుడు హైదరాబాదులో షికారు చేస్తున్న పుకారు. ఆ పరిస్థితే వస్తే చెప్పుకోవడానికి నాథుడు లేడు ఆయనకు. గతంలో కెవిపి రామచంద్రరావు ఆనం వారి రాజకీయానికి రక్షణగా నిలబడేవారు. ఇప్పుడు ఆ కెవిపికే రక్షణ లేక అల్లాడుతున్నాడు. ఆపదలో కాపాడే శక్తి ఆయనకిప్పుడు లేదు. ఆయన తప్ప మరొక కాంగ్రెస్ పెద్దతో ఆనం వారికి సంబంధాలు లేవు. అన్నాదమ్ముళ్లిద్దరు తప్ప వారి వెంట మరొక ఎమ్మెల్యే లేడు. అందువల్ల ఒకవేళ కిరణ్‌కుమార్ రెడ్డి అంత కఠిన నిర్ణయం తీసుకొన్నా, గదిలో చీకటిలో కూర్చుని కన్నీళ్లు పెట్టుకోవడం తప్ప చేయగల్గింది ఏదీ లేదు. అందువల్లనే బొత్సా సత్తిబాబు వద్ద అంత దీనంగా ప్రాధేయపడ్డాడు రామనారాయణరెడ్డి. బొత్సా ఆయన్ను ఎంత వరకు కరుణిస్తాడో వేచి చూడాలి.

## అంత సత్తా దాగివుందా?

మొదటి పేజీ కొరవ

జరుగుతున్నది అదే. కానీ ఆ తప్పు పూర్తిగా బొత్సాది కాదు. అందులో కిరణ్ భాగమే నోటికి తొంభై పాళ్లు. ముఖ్యమంత్రిగా ఆయన ఏ వర్గాన్నీ సంతృప్తి పరచలేక పోతున్నాడు. ఎమ్మెల్యేల బాధ చెప్పనలవి కాదు. ఏ పనీ కావడం లేదన్నది వారి ఆవేదన. అధికారులను పిలిపించి, గద్దించి పనులు చేయించడం కిరణ్‌కుమార్‌రెడ్డికి చేత కావడం లేదు. ఆయన పేషీ నామకార్థంగా వుంది. బొత్సా ఆ లోటు పూరిస్తున్నాడు. అధికారం లేకున్నా అధికారులను పరుగులు పెట్టిస్తున్నాడు. దానితో ఎమ్మెల్యేలు ముఖ్యమంత్రిని వదలి, పిసిసి చుట్టూ మూగుతున్నారు. నిజం చెప్పాలంటే, ముఖ్యమంత్రి పట్ల విశ్వాసం విధేయతలతో మెలిగే మంత్రుల సంఖ్య పట్టుమని పది కూడా లేదు. శ్రీధరబాబు, ఏరాసు ప్రతాపరెడ్డి, డికె.అరుణ వంటి కొద్దిమంది మాత్రమే ఆయన్ను నమ్ముతున్నారు. తతిమా వారిలో ఆయన పట్ల తీవ్ర అసంతృప్తి వుంది. అటువంటి వారందరినీ దువ్వడమే బొత్సా తెలివిగా చేస్తున్న పని.

### జగన్ ఇంటికి కన్నం

ఈవారం పది రోజులలో బొత్సా చేసిన మరొక ముఖ్యమైన పని, జగన్ ఇంటికి కన్నం వేయడం. కాంగ్రెస్‌ను వదలి, జగన్ శిబిరంలో చేరిన దాదాపు అరడజను మంది ఎమ్మెల్యేలను తిరిగి రాబట్టడంలో సఫలీకృతమైనాడు. వారికి ఏ మాయ మాటలు చెప్పాడో తెలియదు. ఇంతకాలం ముఖ్యమంత్రిగా కిరణ్‌కుమార్ రెడ్డి చేయలేకపోయిన పని అది.

మొత్తానికి బొత్సా రాష్ట్ర రాజకీయాలను కదలించగలుగుతున్నాడు. పక్షవాతం రోగుల వలె చచ్చుబడి వుండిన కాంగ్రెస్‌వాదులలో కదలిక తేగలుగుతున్నాడు. ఈ వూపు ఎంతకాలం నిలుస్తుంది అన్నది వేరే విషయం. తనలో అసాధారణ సత్తా వుందని, అవకాశం ఇస్తే తనేమిటో నిరూపించు కోగలనని ఢిల్లీకి స్పష్టమైన సంకేతం పంపగలగడం బొత్సా సాధించిన విజయం. దాదాపుగా కాంగ్రెస్ ఎమ్మెల్యేలందరూ, ఆయన బదలు ఈయన్ను ముఖ్యమంత్రిగా పెడితే పోలేదా అని అప్పుడే అనేస్తున్నారంటే, బొత్సా సత్తా ఎంత త్వరగా ప్రచారమైపోయిందో అర్థం చేసుకోవచ్చు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

ర్థంలో చిత్రవిచిత్రాలు చోటుచేసు కొన్నాయి. నిబంధనలకు విరుద్ధంగా నిర్వహిస్తూ గుర్తింపులేని పేరున్న విద్యాసంస్థలు అధికారుల రాకను ముందుగానే పసిగట్టిన యాజమాన్యాలు పాఠశాలల బోర్డులను తీసివేయడంతోపాటు, పిల్లలను ఇళ్లకు పంపేసి అక్కడ విద్యాసంస్థ నడవడం లేదని నమ్మించ యత్నించారు. ఆ పాఠశాలల వద్దకు వెళ్లిన అధికారులు దీన్ని చూసి నిశ్చేష్టులయ్యారు.

### పోర్టులో యుద్ధ నౌక

కృష్ణపట్నం పోర్టులో యుద్ధనౌక లంగరు వేసింది. 3జి ఎన్ వజ్ర పేరు గల ఈ నౌక అతి పెద్దది. తూర్పు నావికాదళానికి చెందిన ఈ నౌకను ప్రజల సందర్శనార్థం రెండు రోజులపాటు వుంచారు నావికాదళ అధికారులు. పలు పాఠశాలల విద్యార్థులు వెళ్లి నౌకలోని అన్ని విభాగాలను పరిశీలించి వచ్చారు. వీరికి అధికారులు దగ్గరుండి నౌక పనితీరును వివరించారు.

### రోడ్డా... పీడా

పెంచలకోన రహదారి దారుణంగా వుండడంపై అలనాటి కథానాయిక వాణిశ్రీ తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేశారు. నృసింహస్వామి దర్శనానికి కోనకు వచ్చిన ఆమె పొదలకూరు నుంచి పెంచలకోన రోడ్డు దెబ్బతిని వుండడంపై మాట్లాడుతూ భక్తులు అధికసంఖ్యలో వచ్చే పెంచలకోన రోడ్డు బాగలేకపోయినా పట్టించుకోకపోవడం బాధాకరం అన్నారు. మంత్రి ఆనం రామనారాయణరెడ్డి ఈ రోడ్డు మరమ్మత్తు గురించి పట్టించుకోవాలని కోరారు.

## సిద్ధ సమాధి యోగా తరగతులు

బెంగుళూరు ఋషి సంస్కృతి విద్యా కేంద్రం ఆధ్వర్యంలో టౌన్‌హాలులో ఈ నెల సిద్ధ సమాధి యోగా ఉచిత పరిచయ కార్యక్రమం నిర్వహించబడుతోంది. శక్తి సామర్థ్యాలు పెంపొందించు కోవడం, జ్ఞాపకశక్తి, ఏకాగ్రత వృద్ధి, శారీరక మానసిక రుగ్మతలను ఈ యోగ శిక్షణ ద్వారా తొలగించుకోవాలని ఆచార్య శ్రీనివాస్ గురూజీ తెలిపారు. వివరాలకు 80085 47957 నెంబర్‌లో సంప్రదించవచ్చున్నారు.

### శాంతి సంఘం

అఖిల భారత శాంతి సంఘీభావ సంఘం జిల్లా కమిటీని ఇటీవల రాష్ట్ర కమిటి నియమించింది. కమిటీ గౌరవాధ్యక్షునిగా సీనియర్ న్యాయవాది వేములపాటి అనంతరామయ్య వ్యవహరిస్తారు. అధ్యక్షునిగా డాక్టర్ మధుసూదనశాస్త్రి కుమారుడు డాక్టర్ పి.ఎ.చంద్రశేఖర్, ప్రధాన కార్యదర్శిగా విశాలాంధ్ర జిల్లా స్టాఫ్ రిపోర్టర్ శ్రీరామచంద్రమూర్తి నియమితులయ్యారు.

### తుమ్మల రాంప్రసాద్‌రెడ్డి మరణం!

నెల్లూరు నుంచి వెలువడితుండిన అమరజీవి వార పత్రిక సంపాదకుడు తుమ్మల రాంప్రసాద్‌రెడ్డి (62) మే 24వ తేది మరణించారు. రాంప్రసాద్‌రెడ్డి జిల్లాకు అమరజీవి పొట్టి శ్రీరాములు జిల్లాగా పేరు పెట్టాలని మొదటి నుంచి మొక్కవోని దీక్షతో పోరాడిన వ్యక్తి. ఈ పోరాటంలో పలుమార్లు అవమానాలకు గురైనా వెనుకడుగు వేయని ధైర్యశాలి. వారి కుటుంబానికి మా సానుభూతి.

## జనవాణి

2వ పేజీ కొరవ

### బాధ్యతాయుతంగా వ్యవహరించండి

వన మహోత్సవాలు, పోలీసు వారోత్సవాలు, పర్యావరణ వారోత్సవాలంటూ మీటింగులు పెట్టి ఉపన్యాసాలు దంచి వందన సమర్పణ చేస్తారు. మళ్లీ దాన్ని పట్టించుకునే నాథుడే వుండడు. ప్లాస్టిక్ సంచులపై, థర్మల్ స్టేషన్లపై... ఒకటేమిటి సమర సన్నాహాలు బాగుంటాయి. చివరకు నాయకులను, ఉద్యమ నేతలను కంపెనీలు కొనేస్తున్నాయి. అక్కడ నుంచి ఉద్యమాలు మంద గిస్తాయి. ప్రజా ఉద్యమాలు అంటాముగానీ రాజకీయ పార్టీల మద్దతు లేనిదే ఉద్యమాలు విజయవంతం కావు. కాబట్టి నెల్లూరు జిల్లా ప్రజలను మోసగించ కుండా థర్మల్ విద్యుత్ కేంద్రాల వ్యతిరేక ఉద్యమాలు చేయ మనవి.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

# వైఎస్ఆర్ కాంగ్రెస్ సాగుపోరు సక్సెస్!

**నెల్లూరులో వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ ఆధ్వర్యంలో రైతు సమస్యలపై జరిగిన కలెక్టరేట్ ముట్టడి, ధర్నాను ఆ పార్టీ నాయకులు ప్రతిష్టాత్మకంగా తీసుకోవడంతో విజయవంతమైంది.**



సాగుపోరు కార్యక్రమంలో భాగంగా కలెక్టరేట్ వద్ద ధర్నా చేస్తున్న వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నాయకులు, కార్యకర్తలు.

వైఎస్ఆర్ కాంగ్రెస్‌పార్టీ ఆధ్వర్యంలో రైతాంగం సమస్యలపై 13వ తేది కలెక్టరేట్ ఎదుట భారీ ధర్నా నిర్వహించారు. రాష్ట్ర వ్యాప్తంగా అన్ని జిల్లా కలెక్టరేట్ల ముట్టడి చేపడతారని ఆపార్టీ నేతలు ముందుగా ప్రకటించారు. ఈ ప్రకటనతో అప్రమత్తమైన పోలీసు అధికారులు భారీఎత్తున పోలీసుల్ని మోహరించారు. ఐదుగురు ఎస్ఐలు, ముగ్గురు సిఐలు, వందమందికి పైగా పోలీసులను కలెక్టరేట్ రెండు గేట్ల వద్ద బందోబస్తుకు నియమించారు. జిల్లాలో తొలిసారిగా వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ ఆధ్వర్యంలో చేపట్టే ధర్నా కార్యక్రమం కావడంతో జిల్లా నలుమూలల నుంచి కార్యకర్తలను ఇక్కడకు రప్పించారు.

పార్టీ నేతలందరూ కూడా వారి ప్రాంతాలకు చెందిన కార్యకర్తలు, అభిమానులను తరలింప చేశారు. వివిధ ప్రాంతాల నుంచి కార్యకర్తల్ని తీసుకువచ్చిన వాహనాలను టౌన్‌హాలు, రాజీవ్‌భవన్ వద్ద పార్క్ చేశారు. 11గంటలకు టౌన్‌హాలు నుంచి ర్యాలీగా బయలుదేరి విఆర్సీ, జడ్పీ కార్యాలయం మీదుగా కలెక్టరేట్ తూర్పువైపున వున్న గేటు వద్ద చేరుకొన్నారు. గేటు వద్ద వుంచిన వాహనంపై నుంచి నేతలు కార్యకర్తలనుద్దేశించి ప్రసంగించారు. భారీ సంఖ్యలో కార్యకర్తలు రావడంతో బారకాస్ సెంటర్ నుంచి పెద్ద పోస్టాఫీస్ వరకు నడిచి వెళ్లేందుకూ ఆటంకం ఏర్పడింది. ట్రాఫిక్ పోలీసులు వివిధ కూడళ్ల నుంచి వాహనాలను మళ్లించాల్సి వచ్చింది.

## రాష్ట్రంలో రాక్షసపాలన

రాష్ట్రంలో ప్రస్తుతం రాక్షస పాలన సాగుతోందని వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ నేత, నెల్లూరు ఎమ్పీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి విమర్శించారు. రాష్ట్రంలో రెండు దఫాలు ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన దివంగత నేత వైఎస్ రాజశేఖర్ రెడ్డి ప్రవేశపెట్టిన పథకాలనే ప్రస్తుత సిఎం అమలు చేస్తున్నారన్నారు. కొత్తగా ఒక్క పథకాన్ని కూడా ప్రవేశపెట్టలేని దుర్భరమైన స్థితిలో కాంగ్రెస్ ప్రభుత్వం వుందని ఆరోపించారు. రాష్ట్రంలో రైతులు పండించిన వరిపంటకు సరైన గిట్టుబాటు ధర లేక తీవ్రంగా నష్టపోతుంటే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు స్పందించడం లేదన్నారు. మెట్ట ప్రాంతాల్లోని రైతులు పొగాకు పండిస్తుంటారని వైఎస్ హయాంలో గిట్టుబాటు ధర లభిస్తే ప్రస్తుతం సంక్షోభ దిశలో వుందన్నారు.

## ఆనం సోదరులపై విమర్శలు

సాగుపై పోరుతో కలెక్టరేట్ వద్ద జరిగిన ధర్నా కార్యక్రమంలో పాల్గొన్న ఉదయగిరి ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి ఆనం సోదరులపై ఘాటుగా విమర్శలు గుప్పించారు. ప్రభుత్వంలో ఆర్థికశాఖ మంత్రిగా బాధ్యతలు నిర్వహిస్తున్న ఆనం రామనారాయణరెడ్డి జిల్లాలో ఎటువంటి అభివృద్ధి పథకాలు మంజూరు చేయించడం లేదన్నారు. కేవలం తమ నియోజకవర్గాన్ని లక్ష్యంగా చేసుకొని తమకు సహకరించవద్దంటూ అధికారులను బెదిరిస్తున్నారని ఆయన ఆరోపించారు. మంత్రి, రూరల్ ఎమ్మెల్యేలిద్దరూ మునిసిపల్ కార్పొరేషన్‌కే పరిమితమై కోట్ల రూపాయల పనులు వారి అనుచరులకు కట్టబెట్టడం మినహా సాధించిందేమీ లేదన్నారు.

వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ జిల్లా కన్వీనర్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ ప్రస్తుతం రాష్ట్రంలో రైతులు అనేక సమస్యలతో ఇబ్బంది పడుతున్నారన్నారు. రాష్ట్ర ప్రభుత్వం పట్టించుకొని చేయూతనిస్తుందని ఆశించిన రైతులకు చివరకు నిరాశే మిగిలిందని అన్నారు. వైఎస్ హయాంలో రైతుల శ్రేయస్సును, పేద ప్రజల సంక్షేమాన్ని దృష్టిలో వుంచుకొని పనిచేస్తే ఇప్పటి ముఖ్యమంత్రి పూర్తిగా విస్మరించారని దుయ్యబట్టారు. ధర్నా అనంతరం వివిధ సమస్యలతో కూడిన వినతిపత్రాన్ని జిల్లా జాయింట్ కలెక్టర్ సౌరభ్‌గౌర్‌కు అందించారు. ఈ కార్యక్రమంలో కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, ఆనం వెంకట రమణారెడ్డి, కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి, అనిల్‌కుమార్ యాదవ్ తదితరులు పాల్గొని ప్రసంగించారు.

# యాభయేళ్ల క్రితం... చలంతో గోపి మాటామంతీ!

యాభయ్యేళ్ల క్రితం – మద్రాసు లా కాలేజిలో బి.ఎల్ చదువుతున్న పైలాపచ్చీసు రోజుల్లో ఒకసారి చలంగారిని చూసేందుకు అరుణాచలం వెళ్లాను. మా హాస్టల్(మద్రాసు యూనివర్శిటీ స్టూడెంట్స్ క్లబ్ అనే వారు) విద్యార్థులం పాండిచేరి (ఇప్పుడు పుదుచ్చేరి)కి సరదాగా పిక్నిక్ వేశాం. మధ్యలో తిరువణ్ణామలైలోని రమణాశ్రమంలో కాసేపు ఆగాలని నా షరతు. "పోనీలే పాపం, భక్తి కాబోలు" ననుకొని అందరూ సరే అన్నారు. అప్పటికే చలం గారితో నాకు 'లేఖా పరిచయం' ఉంది. ఆయన రచనలు చదివినప్పుడల్లా ఆయనకు ఉత్తరం రాసేవాణ్ణి. ఆయన ఠంచనుగా సమాధానం రాసేవారు. చాలా విషయాలు – తన పుస్తకాలను గురించి నాకు తెలియజెప్పేవారు. బంగారు గని లాంటి ఆ ఉత్తరాలు ఇప్పుడొక్కటీ నా దగ్గర లేదు. కానీ ఒక ఉత్తరం మాత్రం బాగా జ్ఞాపకం– "అన్నీ ఈశ్వరుడు ఈశ్వరుడంటారు. ఎవరా ఈశ్వరుడు, ఎక్కడున్నాడ"ని కొంచెం చనువుగా, మరి కొంచెం దుడుకుగా రాశానందులో. దానికి ఆయన "ఈశ్వరుడు కనిపించాలని నేననుకోవడం లేదు. నేను నమ్ముతున్నాను– అంతే! నీకు కనబడలేదు గనక ఈశ్వరుడు లేడనుకోవడం ఎలాటిదంటే ఓ గుడ్డిపిల్ల అమ్మవొడిలో పడుకొని పాలు తాగుతూ "అమ్మట! నాకో అమ్మ ఉందట! ఉంటే నాకు కనిపించదేం? నాకు కనిపించలేదు గనుక అమ్మ లేదు" అనుకొన్నట్టుంది" అనిరాశారు. మెత్తని చురక చుర్రుమని తగిలింది; అందువల్ల కాబోలు ఇప్పటికీ మరచిపోలేదు. ఆ తర్వాత మళ్లీ ఎప్పుడూ నేను ఈశ్వరుడి మాట ఎత్తలేదు. సరిపడే గొడవ కాదులెమ్మని!





1960 డిసెంబరు కాబోలు స్పెషల్ బస్సులో హాస్టలు మిత్రులతో పిక్నిక్‌కు బయల్దేరాం. సాయంకాలమవుతుండగా తిరువణ్ణామలై చేరుకొని, అరుణాచలం వెళ్లాం. మా వాళ్లంతా బస్సుదిగి ఆశ్రమం చూడ్డానికి వెళ్లారు. నేను మాత్రం ఆ ఆశ్రమం ముంగిట వున్న చలం గారి కుటీరానికి వెళ్లాను. అప్పటికే నా రాక గురించి చలం గారికి ఉత్తరం రాసి ఉన్నాను. 'తప్పకుండా రండం'టూ ఆయనా రాశారు. నే వెళ్లేసరికి ఇంటిల్లపాదీ నా కోసం ఎదురు చూస్తున్నట్లుంది.

45 నిమిషాలున్నానో ఏమో! అంతసేపూ చలంగారు చిరునవ్వుతో అప్పుడప్పుడు ఒక్కో మాట మాట్లాడారు. సౌరిస్‌తో అయితే నేనసలు మాట్లాడలేకనే పోయాను. ఏవో ఒకటీ అరా అడిగితే ఆమె పొడిగా జవాబులిచ్చారు. తక్కినవాళ్లు ఏవేవో చెప్పారు. ఉత్తరాల్లో తెలిసీ తెలియని విషయాలు బోలెడు రాసేవాణ్ణి. ఆయన రచన చదివినప్పుడల్లా దాన్ని గురించి నా అభిప్రాయం ఏ జంకూగొంకూ లేకుండా రాస్తుండేవాణ్ణి. ఆయనా ఓపిగ్గా జవాబు రాసేవారు. తీరా ఎదుట కూచునేసరికి అన్నీ మరచిపోయి, హెడ్మాస్టరు ముందు స్టూడెంటులా ఉండిపోయాను. చివరకు ఏవో నాలుగు – అర్భక ప్రశ్నలు వేశాను. చలం గారు నేనేం అడిగినా ఆదరంగా జవాబులివ్వడం ఇప్పటికీ నా కళ్లముందే కదలాడుతోంది. ఆయన నోట్లో నుంచి ఒక్కొక్క మాటా వెలువడుతుంటే వాటిని శ్రద్ధగా యేరి ఒళ్లో వేసుకొన్నట్టనిపించింది. తర్వాత మా సంభాషణను 'గోష్టి' అనే మాట అతిశయంగ తగిలించి, అప్పట్లో విజయవాడ నుంచి వెలువడే సోషలిస్టు మాసపత్రిక 'చేతన'లో ప్రచురించారు. అన్ని మంచి పత్రికల్లాగే 'చేతన' కూడా కొద్ది కాలానికి చెల్లిపోవడంతో పాత కాపీలు కూడా దొరక్కుండా పోయాయని తెలిసింది. మళ్లీ ఇన్నేళ్ల తర్వాత 'అక్షర'లాంటి సాహిత్య అక్షయపాత్రను వెలువరించిన కావలి నవవికాస్ నిర్వాహకుడు చిరకాల మిత్రుడు ఎన్.వి.రమణయ్య ఎక్కడో వెతికిపట్టుకొని పంపించారు. యాభయ్యేళ్లనాడు మద్రాసు సముద్ర తీరంలో తప్పిపో యిన పసిపాప ఒక తెల్లవారి వాకిటికొచ్చి నవ్వుతూ నిల్చుంది.

చలంగారికి సంబంధించిందేదీ అందకుండా పోకూడదని ఆనాటి 'గోష్ఠి'ని యథాతథంగా ఇస్తున్నాను.

(ఇటీవల దివంగతులైన సీనియర్ జర్నలిస్ట్ పెన్నేపల్లి గోపాలకృష్ణ (గోపి) బాగున్నప్పుడు వ్రాసిన వ్యాసాన్ని పాఠకుల కోసం ప్రత్యేకంగా ఇస్తున్నాం. – *సంపాదకుడు*)

Regn.No. : RN 1156 / 57
J/Nellore/008/09-11

# బ్రహ్మోత్సవ ఆహ్వానం

శ్రీ పొట్టిశ్రీరాములు నెల్లూరు జిల్లా,
దుత్తలూరు మండలం, నర్రవాడ గ్రామంలో
19వతేది నుంచి జరుగనున్న
**శ్రీ వెంగమాంబ పేరంటాలు బ్రహ్మోత్సవాలకు**
విచ్చేయుచున్న భక్తజనులకు హృదయపూర్వక
స్వాగతం తెలియజేస్తూ...
**జగన్మాత శ్రీ వెంగమాంబ తల్లి అనుగ్రహాన్ని పొంది**
సుఖ సంతోషాలతో చల్లగా వుండాలని
మనసారా కోరుకుంటూ...

శ్రీశ్రీశ్రీ వెంగమాంబ పేరంటాలు



**మాదాల జానకిరామ్**
మాజీ మంత్రివర్యులు
ఆంధ్రసేన వ్యవస్థాపక అధ్యక్షులు



**బొల్లినేని వెంకటరామారావు**
ఉదయగిరి నియోజకవర్గం

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.